# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 4 | రాజమహేంద్రవరము 1-3-1981 | సంచిక 9


## ఈ సంచికలో


1) భ్రమర గీత(ము)లు.
2) నలదౌత్యము - తులనాత్మక పరిశీలనము.
3) భావవిప్లవ సారథి దాశరథి 'తిమిరంతో సమరం'
4) ఆంధ్రకవులు - అభ్యవహార పద్ధతులు.
5) తెలుగువారు - ఒరియా భాషా సేవ.
6) తుమ్మలవారి 'రాష్ట్రగాన' రామణీయకత.
7) సులోచన.
8) నాటక చరిత్ర నవ్యయుగారంభంలోని 'నాటకాల్లో వాస్తవికతావాదం'
9) ఈపక్షంలో.




16—3—81 సంచికలో కవిగా అప్పకవి ప్రతిభ, వేదమువారి యౌగంధరాయణుడు, వేదులవారి దీపావళి, హలం పట్టినవారికోసం కలం మొదలగునవి ఉంటాయి.


1, 16 తేదీలలో ప్రచురింపబడును

చందా :
సంవత్సరమునకు రు. 12—00.
అర్థసంవత్సరమునకు రు. 6—50.

విడిప్రతి 60 పై.

# ★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

సంపుటము 4 రాజమహేంద్రవరము 1-3-1981 సంచిక 9


## భ్రమరగీత(ము)లు


– 'భారతీప్రియ' వెలుదండ సత్యనారాయణ, ఎం. ఏ.


భాగవతమున దశమ స్కంధ పూర్వ భాగమున భ్రమరగీతము లున్నవి. మాధవుని పంపున నుద్ధవుడు నందగోకులము నకువచ్చి విరహతప్తులైన యశోదానందులకు, గోపికలకు శ్రీకృష్ణుని యోగక్షేమములు తెలియబరచుట యిందలి కథాంశము.

ఆతనితో నాతురతతో నా గోపికలు మాటాడువేళ నొక తుమ్మెద వారి ముందెరుగుచువిదలించినను పారిపోక బాధింప సాగెను. ఒకగోపిక 'హరి తన్నుం బ్రార్థించి పుత్తెంచిన దూత' యని కల్పించుకొని యుద్ధవునికి సన్యాపదేశంబై యొలుకపడ నయ్యలితో, నన్న మాటలు 'భ్రమరగీతములు' గా ప్రసిద్ధి నొందెను.

వీటి నాధారముగా చేసికొని 'జానపద సాహిత్యమున 'భ్రమర గీతలు' వెలసినవి. శ్రీ రామరాజు గారు సేకరించిన యీ గీతలకు కర్త కోనప్ప యనునతడు. ఇపు డీ రెండింటిలోని విశేషాలను కొన్నిటిని పరిశీలింతము.

నవవిధ భక్తులలో నొకటై తనదైన యొక ప్రత్యేకత నేర్పరచుకొని, సర్వాదరణీయమై, భగవత్సాన్నిధ్యదాయకమైన మధురభక్తి గోపభామినుల హృదయములతో తప్ప మరెవ్వరిలో పరిపూర్ణముగా వికసించి పరిమళాలు వెదజల్లినది? కృష్ణు డుద్ధవునితో —

'లౌకిక మొల్లక న న్నా
లోకించు ప్రసన్నలకును లోబడి కరుణా
లోకనముల పోషింతును
నా కాశ్రితరక్షణములు నైసర్గికముల్' భా.

అంటాడు.

కృష్ణు డుద్ధవునితో గోపికలను గురించి చెప్పుమాటలు మరి రెండు పద్యము లందు మాత్రము భాగవతమున కలవు. జానపద గేయమున నీ సందర్భమనేక పాదములుగా విపులీకరించబడినది. మచ్చుక —

'నన్ను స్వామి ప్రియు డనుచు
నన్ను నాత్మ సర్వమనుచు
నన్ను నమ్మియుంద్రు గోపనాథ లుద్ధవా!
నన్ను నమ్మి లోక సుఖము
లన్ని విడిచి లజ్జ విడిచి
ఉన్నస్థితిని మరచి మగువ
లుందు రుద్ధనా!
దినము 'నన్ను జూచి గాని
దివ్య భూషణమ్ము లిడరు
అలర నా పొత్తైగాని అన్న మొల్లరు.
మరియు నాకు దాచి కాని
మంచి గంధ మలదు కోరు
విరులు నన్ను జూచిగాని
వేడ్క ముడువరూ!'

ఇట్లు సాగిపోతుంది.

తన కెంతసన్నాహమో ఆతనికి అంతా చేసి కృష్ణు డుద్ధవుని రథారూఢుని చేసి మధురానగరమునుండి వ్రేపల్లె కంపెను. ఆతడు గోకులమునకు గోధూళివేళకు చేరుకొనెను.

గోపకాంతలు పాలు పితుకుచు మధుర కంఠములతో బాలకృష్ణుని లీలలు ఆలపించుచుండగా ఆలకించుచు అడుగుకొనుచు నందునిల్లు చేరెను. నందు డాతనిని ప్రేమ మీర గుండెకుహత్తుకొని సాక్షాత్తు తన ముద్దులకొడుకు వచ్చినట్లుగానే తలంచి లోనికి గొనిపోయి ఎన్నియో అతిథి సత్కారములు చేసినాడు.

'హరిని గాను మదిని దలచి
యర్ఘ్య పాద్య విధులు చేసి
సరస భక్ష్యాన్నములకు
సౌఖ్య పదవినా
అచ్చ నావుల పెరుగు దెచ్చి
కొంతినిమ్మకాయ గలిపి
ఒనర యశోదాదేవి వడ్డించెను'

అని జానపదులు కూర్చిన కూర్పు భాగవతము నందలి



పుణ్యాత్ముని కౌగలించుకొని నం
 దాభీరు డానందియై
మా పాలింటికి కృష్ణుడీత డనుచున్
 మన్నించి పూజించి వాం
ఛా పూర్ణంబుగ మంజు లాన్నమిడి మా
 గ్రాయాసముం బాపి, స
ల్లాపోత్సాహము తోడ నిట్లనియె సం
 రక్షించి మోదంబునన్'

అన్న పద్యాన్ని జ్ఞప్తికి దెచ్చును.

కృష్ణుని చిన్నతనపు చేష్టలన్నియు నొక్కొక్కటే మదిలో మెదలగా యశోదామాత అతని ముం దన్నిటిని వెళ్ళబోసికొన్నది. ఆ వేళ –

'వనిత వనములందు పాలు
 వచ్చి వరదలై పాగ
మరియు కన్నులందు జలము
 తెరము కురిసెను'

అని చిత్రించినారు జానపదులు. దీనికి మూలము భాగవతమున –

'పెనిమిటి బిడ్డని గుణములు
వినుతింప యశోద ప్రేమ విహ్వాలమతియై
చను మొనల పాలు గురియగ
కనుగొనలను జలము లొలుక గా
 బెగ్గిలియెన్'

అను పద్యము.

రెండింటిలోను యశోద మాతృత్వ వర్ణనము పరాకాష్ఠ నందుకొన్న దనుటలో సందియము లేదు.

ఆ తల్లి ప్రేమ కలరిన యుద్ధవుడా మెను కృష్ణతత్త్వము నుపదేశించెను. ఆసందర్భము నందలి

'చిత్తంబు లతనిపై జేర్చి సేవించితి
 రతి కృతార్థుల రైతి రనవరతము
శోభిల్లు నింధన జ్యోతి చందమ్మున
 నఖిల భూతములందు నతడు' (భా)

అను పద్యము నందలి విశేషములే గేయమున క్రిందిరీతిగా ప్రతిబింబించినవి.

'అరియ కాష్ఠమందు నెపుడు
 అగ్ని యుండు రీతి హరి
వరుసజగమునందు జ్యోతివలెను వెలుగునూ
మనోవాక్కాయములను
 మరువకెపుడు హరిని దలచి
తనియుభాగ్య మబ్బె మీరు ధన్యులైతిరి'

ఆ రాత్రి అట్లు గడచెను. ఇంకా పూర్తిగా తెలవారలేదు. సందెవేళ రేపల్లెలోని గొల్లభామలు చల్ల చిలుకుచుండిరి. నిరంతర కృష్ణధ్యానపారీణులైన వారి కంఠములు కృష్ణ విరహమును ఆలపించుచునే యున్నవి. కవ్వపుచప్పుడు దానికి శ్రుతిగా భాసించినది

'అంత నొక్క భ్రమర మచట
 అలగ ధ్వనులు పాడగానె
సంతసమున జూచి గోప
 సతులు మూకలై
ఆర్యు డుద్ధవుండు వినగ
 హరికి దూతగాను తెలిసి
తరుణు లెల్ల తుమ్మెద జూచి
 వరుస బలికిరి

'మధుప; మాహితవునికిని
 మక్కువవాడౌట వలన
మధుర ధ్వనులచేత ముట్టకు
 మాపాదములన్'

ఇది భాగవతము నందలి 'భ్రమరా దుర్జనమిత్రముట్టకుము మాపాదాబ్జముల్' అన్న పద్యమును తలపించును.

భ్రమరముతో గోపికలింకా –

'కనకరత్నమయపుటిండ్లు
 కావు మా యిండ్లు హరికి
ఘనులు రాజులుండు నగరు
 కాదు గోకులం
శృంగార వనము కాదు
 భృంగ మా వనము హరికి
పొంగు తురంగములు గావు
 పొసగు గోవులూ
అందమైన స్త్రీలు గారు
 హరికి గోపసతులు మధుప
మునువటి సతులకంటె క్రొత్తలు
 మోహమెక్కువ'

అంటారు.

'మా యిండ్లా! ఏవో పూరిగుడిసెలు. మానగరా! గొల్లవాడ! గొల్లకులము! మా చుట్టూ గోవులు. పోనీ! మేము అందగత్తెలమా! కానేకాము. ఇక నీ గుణమా! పూవుపూవున మరందమును రుచిచూచుచు సాగిపోవు మధుపగుణము! ఇక మాహృదయాలలోని ప్రేమ నే మని చెప్పుకునేది! చెప్పుకున్నా లాభమేమున్నది? అయినా మాఎదలలోని వలపు నీకెవరకు తెలియని దేమీకాదు. కాని తెలిసినా ప్రయోజనము లేకపోవుచున్నది. ఎందుకన నీది మధుప గుణము కదా! (అందుకనే 'మునుపటి సతుల కంటె క్రొత్తలు మోహమెక్కువ' అని చెప్పిపోడుచుట.) ఐనా నీపై మా కెందుకింత మమకారమో ఊహించితివా! నీ వీ గొల్లవాడలలోనే మా పరిసరాలలోనే పుట్టావు. ఆడుతూ పాడుతూ మమ్మల్ని మైమరపిస్తూ మా మధ్యనే పెరిగావుగనుక. కాని మా దురదృష్టవశాత్తూ వీటి నన్నిటినీ విస్మరించావు. రెక్కలు వచ్చిన పిట్టవలె ఎచటికో ఎగిరిపోయావు. ఐనా మేము నిన్ను మరచితిమా, నిన్ను వలచుట మానితిమా! లేనేలేదు. అది ఈజన్మలోనే జరగదు సుమీ! నీ విరహశోకమే మా ప్రేమకు ఫలమైతే అలాగే జరుగనీ! కాని 'పూవు' వంటి మా మృదుహృదయాలు దాని ధాటికి తట్టుకొనగలవా!' ఇదీ గోపికా హృదయము. ఈ ఊహ లన్నియు పై గేయముపంక్తులందు పరోక్షముగా దాగి యున్నవి. దీనికి మూలమైన భాగవత పద్యమును చిత్తగించండి.

'కాంచన రత్న సంఘటిత సౌధంబులే
 మా కుటీరంబులు మాధవునకు
వివిధ నరేంద్ర సేవిత రాజధానియే
 మా పల్లె యదువంశ మండనునకు
సురభి పాదప లతా శోభితారామమే
 మా యరణ్యము సింహ మధ్యమునకు
కమనీయ లక్షణ గజతురంగంబులే
 మా ధేనువులు కంస మర్దనునకు

రూప విభ్రమ నైపుణ దూఢలైన
మగువలమె మేము మన్మథ మన్మథునకు
ఏల చింతించు మము కృష్ణు డేల తలచు
పృథివి నధిపులు నూతన ప్రియులుగారె!'
అనవలసినమాటలన్నీ అయిపోయిన పిదప
కడకు హృదయము నాపుకొనలేక
'ఎన్నడు హరి యిటకు వచ్చు
యింతుల దుఃఖమెన్న డణచు
ఉన్నమాట చెప్పవయ్య
ఒనర ఉద్ధవా?'
అని బతిమాలిరి.

ఇన్ని మాటలన్నను అసలు వారి ఎదల లోతులలో మెర మెరలాడుచు దాగి యున్న మాట యిదికదా! అహా! గోపికల మధురభక్తి ఎంత మహోన్నతము! నిరుపమానము!

ఉద్ధవుడు కృష్ణుని క్షేమములు తెలిపెను. మరియు

'పతులు దూరముండుటకును
సతుల ప్రేమ లెక్కువౌను
పతులు చేరువైతె సతుల
భ్రాంతి తక్కువ
మీకు నా యందు భక్తి
మిక్కిలుండ వలసె నింక
శోకతోన దూరమైతి
సొంపుమీరగా'

అని కృష్ణుని మాటలు చెప్పెను. భాగవతమున నిట్లున్నది.

'చెలువల్ దవ్వులనున్న వల్లభులపై
చిత్తంబులన్ గూర్తురు
త్కలికన్ చేరువ వారికంటె నదియున్
గాకెప్పుడున్ నన్ను మీ
గలుం చింతించుచు నుండగోరి యిటు దూ
రస్థత్వముం బొందితిన్
దలకం బోలకు నన్ను గూడెదరు ని
త్యధ్యాన పారీణలై.'

ప్రాణేశ్వరునితో తాదాత్మ్యము నిత్యధ్యానముననే కలుగును కదా? అది ప్రియుని ఎడబాటుననే సాధ్యము. శారీరకముగా ప్రాణకాంతుడు సన్నిహితుడై యుండ నీ విరహవ్యథ యెక్కడిది? అది లేనిదే ప్రాణేశ్వరుని విలువ తెలియుట యెట్లు? అందుకే కృష్ణుడు 'నిత్యధ్యాన పారీణలైనప్పుడే నన్ను గూడెదరు' అని హెచ్చరించినాడు.

గోపిక లుద్ధవునకు కానుక లిచ్చి సాగనంపుచు కృష్ణునొకపరి రమ్మనిరి. ఉద్ధవుడు వారి వినిర్మల ప్రేమ భావమునకు చలించిపోయినాడు. ఎంతగానో ముగ్ధుడై పోయినాడు. 'వారెంత ధన్యజీవనలు.' అనుకున్నాడు. 'అంతటి భాగ్యము తన వంటివారి కెట్లబ్బును' అనుకున్నాడు. అందులకే ఈ విషయమంతా కృష్ణునకు విన్నవించి తాను గోకులభూమిలో గడ్డిపరకగా జన్మించు భాగ్యమునకైనా నోచుకొనకపోయితిని గదా! యని విచారమును వెలిబుచ్చినాడు.

చివరగా ఒకమాట, ఈ గేయము పూర్తిగా జానపద పరిసరములనుండి జనింపలే దని, (అచ్చమైన జానపద గేయము నందు మాండలికాదు లెక్కువ. పాండిత్య ప్రకర్ష గ్రాంథిక శబ్దములు చాలా తక్కువ.) భాగవత పద్యముల నే ఎవరో పెద్దగా మార్పులు చేయకుండా గేయముగా మలచినా రని చెప్పవచ్చును. ఇందుల కీ గేయమునందలి శబ్దజాలమే సాక్ష్యము.

—...—

# నలదౌత్యము - తులనాత్మక పరిశీలనము

- శ్రీ సాంబయ్య పరిమి, ఎం. ఏ.

మహాభారతలోపాఖ్యానములలో ప్రసిద్ధమైనది, మకుటాయమానమైనది నలోపాఖ్యానము లేక దమయంతీ చరితము. మహాభారతమున ఈ ఉపాఖ్యానము సందర్భోచితమైనది ధర్మరాజు - సతీ, సహోదర సమేతముగ అరణ్యవాసము చేయు సందర్భమున తత్ క్లేశోపశమనమునకై బృహదశ్వుడు పై కథను ధర్మరాజాదుల కెరిగించును. ఈ కథయందలి నలదమయంతుల అరణ్యకష్టములకు పాండవుల అరణ్య క్లేశమునకు తుల్యత్వము కన్పించును. క్లేశతుల్యత్వమునకు గాను స్థూలకథాసాదృశ్యము నిందు ఏర్పడినది. భారతకథను పాండవులను, స్థూల దృష్టితో చూచిన నలోపాఖ్యానమునకు నలునకు సాదృశ్యము గోచరమగును.

నలుడు - పంచ పాండవ సదృశుడు.

పాండవులు యమ, వాయు, ఇంద్ర, అశ్వినీ దేవతా వరప్రసాద జనితులు. నలుడు - ధర్మరాజువలె ధర్మ నిష్ఠాపరుడు. అనవరతాక్షప్రియుడు. జూదముచే రాజ్యభ్రష్టుడు. భీమునివలె పాకశాస్త్ర ప్రవీణుడు. పాచకత్వమున అజ్ఞాతవాసము చేసినవాడు. అర్జునునివలె ధనుర్విద్యా పారంగతుడు. నకులునివలె సుందరుడు. సహదేవునివలె అశ్వహృదయము నెఱిగినవాడు. అంతేకాదు. '...
...మనోభవ నిభు, నమరేంద్ర ప్రతిము, దినకరాభు, సుధారుక్ సము వరుణసదృశు ధనదోపము, నశ్వి సమాను నిషధపతి...' (ఆం.మ.భా. ఆరణ్య. ద్వి. 41 పద్యము) అని నన్నయ వివరణ. పైగా దౌత్యసమయమున యమ, ఇంద్ర, వరుణ, అగ్ని తేజస్సము పేతుడు. దీనిచే పంచపాండవ సమగ్రస్వరూపునిగా కాక, నలుని అధికునిగా భావింపనగును.

దమయంతి - ద్రౌపది. ఇద్దరూ మునుల అనుగ్రహమున జన్మించినవారే - 'భీముండను వాడనపత్యుడై వ్రతము లోలిసలుపుచు దమను డన్సన్మునిఁ బత్నియుఁ దాను నుపాసించి, తద్వరమున దమయంతి యనుసూఁతు, దమ దాంత దమనుల స్సుతులను బడసె...' (ఆం. మ. భా. ఆర. ద్వి. 8 పద్య) అని దమయంతి పుట్టుకను; 'అయ్యాజుండు యాజకత్వంబున కొడంబడి నీకోర్కికిం దగిన యట్టి కొడుకును

కూతురు బుట్టుదురు...' (ఆం. మ. భా. ఆది. సప్త. 17 పద్యము) అని ద్రుపదునకు ద్రౌపది జన్మించిన తీరును, ఆంధ్ర మహాభారతము వివరించినది. నలునకుగల పంచపాండవసాదృశ్యముచే దమయంతిని కూడ పంచభర్తృక అనవచ్చును. అర్జునుని కోరియే ద్రౌపదీ స్వయంవరమున మత్స్య యంత్రము ఏర్పాటు జరిగినది. నలుని గోరియే దమయంతీ స్వయంవర ప్రకటనము భీముడు చేసినది – 'ఏమి సేయుదు నెవ్విధంబున నమ్మహీపతి నిట రావింప నగునోయని చింతించుచు సంప్రాప్త యౌవనయైన కూతుం జూచి యప్పుడు

ఆ వైదర్భుడు నిఖిల ధ
రావలయములోనఁ గలుగు రాజన్యుల నా
నావిషయాధీశ్వరులను
రావించెం దత్స్వయంవర వ్యాజమునన్'
(అర. ద్వి. 27.28)

– ఇరువురి భర్తలు జూదమున రాజ్యభ్రష్టులై వనవాసము చేయవలసి వచ్చినవారు. ఇద్దరు సైరంధ్రులుంగ వనవాసము చేసినవారే '–అంతనుండియు నమ్మహాసుబాహునేక వస్త్రు ననికేతను నన్వేషించుచు సైరంధ్రీ వృత్తంబు సేకొని...' (అర. ద్వి. 119) అదియు అజ్ఞాతవాసమే. ఇద్దరు జూదమున పణముగ నెంచబడినవారే–

'దమయంతి రోయిగా జూ
దము నీతో నాడఁగడఁగెదను; ధరణీరా
జ్యము నీవు నాకు రోయిదు
మామరగ జూదంబు నీకు నభిమత మేనిన్'
(అర. ద్వి. 222 పద్యము)

అని నలుడు పుష్కరునితో పల్కెను.

దుర్యోధనుడు– కలిఅంశమున దుర్యోధనుడు జన్మించెనని మహాభారతమున గలదు. '...కలియంశంబున దుర్యోధనుడు పుట్టె...' (ఆది. తృ. 80 వచనము) నలోపాఖ్యానమున కలిప్రభావముననే నలుండు రాజ్యభ్రష్టుడయ్యెను. రెండుకథల యందును కలి–దుర్యోధనులు ప్రత్యక్షముగా కాక పరోక్షమున, పుష్కర, శకునుల సహాయమున నల – ధర్మరాజులతో పాచికలాడిరి.

ఈ పైసాదృశ్యములచే నలోపాఖ్యానమును సంక్షిప్తభారత మనవచ్చును. అంతేకాదు.

'కర్కోటకస్య నాగస్య
దమయంత్యా నలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షేః
కీర్తనం కలినాశనం'

అను ప్రసిద్ధాభాణకమును కలదు. ఇందుచే నలోపాఖ్యానము సుప్రసిద్ధము.

నలచరిత్రకు ఆధారము సంస్కృత భారతము. హర్ష నైషధము. శ్రీమదాంధ్ర మహాభారతము, శృంగార నైషధము, రామరాజ భూషణుని హరిశ్చంద్ర నలోపాఖ్యానము, చక్రపురి రాఘవాచార్య నలచరిత్రము. ఇవికాక ఒకటి రెండు అముద్రిత కావ్యములు కలవు.

నన్నయ్య వ్యాసభారతమున కనుగుణముగ నలోపాఖ్యానమును రచించెనని ప్రత్యేకముగ చెప్ప పనిలేదు. అటులే శ్రీనాథుడు హర్ష నైషధమును తెనిగించిన విషయము పాఠకులకు విదితము. కాని రాఘవాచార్యుడు నన్నయ అడుగు జాడలలో, వర్ణనాతిశయముతో, అలతి మార్పులతో, ముగ్ధలావణ్యవతియైన దమయంతిని సుకుమారిగ చిత్రించెను. రామరాజభూషణుని 'హరిశ్చంద్ర నలోపాఖ్యానము' లోని నల చరిత్రమున కాధారము ___ నాటి కాలమునకే వెలసిన ఆంధ్రమహాభారత, శృంగార నైషధములను గ్రహింపక, వ్యాస, భారత, హర్ష నైషధముల నే గ్రహించినాడు. సంస్కృత నైషధము సంపూర్ణము కాక పోవుటచే స్వయంవరానంతర కథకు వ్యాసభారతమునే ఆశ్రయించినాడని శ్రీవఝల చినసీతారామస్వామిగారు 'హరిశ్చంద్ర నలోపాఖ్యాన విమర్శనము' న తెల్పియున్నారు. ఇవి కాక కవి పేరు తెలియని నలచరిత్రము (M. 218) తంజావూరు సరస్వతీ గ్రంథాలయమున గలదని తెలియుచున్నది. ఇది అముద్రితము. ద్విపద కావ్యము' అవతారికలోఁగాని, ఆశ్వాసాంతమున గాని కర్తృనామము లేదు.

వలపులదొంతి, భావజుమేటి దంతి, చేమంతి పూబంతి అయిన దమయంతి దమన మహర్షి తపఃఫలమున భీమునకు జనించిన ముద్దులపట్టి. వచోవాణియై, సకలకళా సరస్వతియై, యౌవన వయః పారిజాతయై, విదర్భలో వెలసిన వనిత. నవద్వీప నాథుడైన నలుని రూప గుణ ప్రభావములకు సమ్మోహ మందిన సాధ్వి. రాజహంస దౌత్యప్రభావమున దేవేంద్రాదుల అనుగ్రహమున నలుని వరించిన రాజకుమారి. అనతి కాలముననే తల్లియై ధర్మమును తప్పక చరించిన తరుణి, ఎటులనో కలిప్రభావమున సర్వస్వమును కోల్పోయిన నాథుని వెంట కాననమున గ్రుమ్మరిన లలన. భర్తనెడబాసి, సర్పగ్రస్తయై, కిరాతునిచే రక్షింపబడి, మోహింపబడి తన పాతివ్రత్య ప్రభావమున వానిని పరలోకగతునిగా చేసిన పావని. ఋషి అనుగ్రహమున భవిష్య ద్వర్తనమును గ్రహించి తండ్రిని జేరినతన్వి. తనధిషణాశక్తిచే నాథుని కెలను నెఱిగి ద్వితీయ స్వయంవరము నెపముననలునిచే గ్రహింపబడిన పరమ పతివ్రత.

శృంగారమునందు కుమారిగ ఆంధ్ర మహాభారతమున, శృంగారిగా శ్రీనాథ నైషధమున, రాగిణిగ రాఘవు నలచరిత్రమున వర్ణింపబడిన చంద్రవదన దమయంతి, వచోవైఖరి: భారతమునందు గాంభీర్య భరితమై, శృంగార నైషధమున సొగసుల తునకలై, నలచరిత్రమున నవ్వుల రవ్వలై, వెలసినది. యౌవ

కావ్య కాంతలలో 'పుటపాక ప్రతీకాశం బైన కరుణరసమునకు కాణాచి యైన యింతి దమయంతి.

నలదమయంతులు పరస్పరము -

నలుగుణములు దమయంతికి
నలునకు దమయంతిగుణగణంబులుజనులి
మ్ములఁబొగడుట నిరువురకును
వెలసె మనోభవ వికార విభ్రమ మెదలన్
(అర. ద్వి. 10)

ఇట్లుండ హంసదౌత్యము వారి మన్మథాగ్నికి ధాయ్య మయ్యెను. అంత 'నలదమయంతు లిద్దరు మనఃప్రభవానల తీవ్రమానులై విరహ వేదననుపొందిరి. చిత్తజాదంతి దమయంతి మనసిజు బాధకు తాళలేక 'పలుకదు సఖులతో లలితాంగి మిన్నకయఱయుచు నుండుఁదా నను దినంబు, జారు విభూషణాహార విహారశయ్యాసన భోగంబులందు విముఖియయి'అంతఃకరణ సంతతమనోజాతసంతాప వివర్ణవదనయై' నలు డను ధరణినాథునందబుద్ధి నిలిపి కందర్ప బాధిత యగుచు నున్నయది' అని నన్నయ దమయంతీ విరహాముసు వివరించినాడు.

ఇక శ్రీనాథుని చిన్నారి దమయంతి ధీరోదాత్త, మత్తగజగమన.

'బోటిమది కింపుగాదయ్యొ నాటపాట
మృగవిలోచన కంతంత మేను డస్సె
నంత కంతకు సంతాప మతిశయిల్లె'
(శృం. నై. ద్వి. 113పద్యము.)

అంతేకాదు. విరహసంతాపాతిరేకంబున' అహర్నిశమున్ సాంద్ర నిరంతరస్మృతి సమున్మేషంబునం గాంతకుం దశదిగ్భిత్తులయందు గానబడియెం దద్రూపచిత్రావళుల్' శృం. నై 115 పద్య. అని శ్రీనాథుడు వివరించినాఁడు.

చక్రపురి రాఘవాచార్యుని నలచరిత్రమున దమయంతి -

'పతిరాక యిపుడు నాప్రాణంబు లుండ, పతివలారా' అని అవని మూర్ఛిల్లిన మగువ. అంతేకాదు.

'ఒక చోటగోరి వేఱొక చోట చేరు
నొక చెలి పేర వేఱొక చెలి పిలుచు
నొక పని కనుచు వేరొక పని దలఁచి'
(న. చ. ప్ర. 891-893)

నలత పడు నెలత, సొలయు చెలియ, చలన మెందు లలన వగపు చెందు మగువ. విభ్రాంతి పొందు ఇంతి.

'నలరాజ చంద్రుని నరలోక విభుని
పలు మారు పలు మారు భావంబులోన
తలపోసి తలపోసి తలయూచి, మేను
పులకించి పులకించి' న పొలతి.

అంతేకాదు.

అతి సుకుమార మానస, విరహ వేదనను భరింపజాలక పలుమారు మూర్ఛ పోయిన పడతి. ఎట్టకేలకు చెలులు
'కనుగవ నీ హార కణములు తుడిచి
చలువ పన్నీరుల జలకంబు లార్చి
కలికి గుబ్బలమీద కస్తూరి పూసి'
(న. చ. ప్ర. 94-3)

శిశిరోప చారములు చేసి దమయంతీ విరహవేదనను భీమనాయకున కీవిధముగ తెలిపిరి___

'ఇగురు పాన్పుల మీద నింతిని జేర్చ
చిగురాకు లన్నియు చెచ్చెరగమలె
తలచి తామర పూల తల్పంబునందు
పొలతుక నుంచిన పొగలుగా వెలసె
చల్లనినీటిలో సకియ నుంచినను
కల్లగా దది వెచ్చగా నాయె జలము.
చందనం బలదిన జలజాక్షి మేన
కంది యాక్షణమున కస్తూరియయ్యె.
(న. చ. 1020-8)

ఈతీరుగ దమయంతీ విరహ వేదనను వర్ణించిన ముగ్గురుకవుల విధానమునందు గాంభీర్యము, ఉదాత్తత ఊహాతిశాయిత్వము, ప్రస్ఫుటములు.

భీమ నాయకుడు దమయంతీ స్వయంవరమును ప్రకటింప ఆ స్వయంవరమునకు వచ్చుచున్న నలమహారాజును, యమ, ఇంద్ర, అగ్ని, వరుణులు దమయంతి కడకు దూతగ పంపిరి. ఈసందర్భమున కవులందరు పలుత్రోవలు త్రొక్కిరి.

నన్నయ :-

'దమయంతి మనో భవనిభు
నమరేంద్ర ప్రతిము,దినకరాభు,సుధాంశు
సము, వరుణ సదృశు ధనదో
పము, నశ్వసమాను నిషధపతి ...
(అర. ద్వి 41 పద)

అయిన నలుని జూచి 'మదన ప్రేరితయై లజ్జ యుడిగి భీతిల్లక బృందారకమూర్తికి రాజకుమారి' నీవు మహానుభావుండ వెవ్వండ విందుల కేమి కారణంబున నేకతంబ వచ్చితివి!' అని ప్రశ్నించినట్లు కల్పించినాడు.

శ్రీనాథుడు -:

'అప్పు డప్పుడమితేనిం గనుంగొని...
...ధీరోదాత్త గావున నయ్యాది గర్భేశ్వరి సమున్నతాసనంబున మున్నున్నయునికిన యుండి ... వినతివాక్యముల పలుకుచు ఎవ్వడ వని ప్రశ్నింపబూని నలుడని తెలిసికొని-

అతిథి తమ యింటికే తెంచునపుడు 'సేయు సత్క్రియా చార విధికలాసరణి' సేవించి నట్లు వివరించినాడు.

రామరాజ భూషణుడు :

నలుని గూరి నలత చెందుచు ఆ విరహ వేదనకు తాళలేక చెలికత్తెలను

'అరయు దూరస్థితు నృపాలు నసమబుద్ధి
దవిలి తగని కోర్కెనుగోరి తవిరి మొగ్గ
గసికలకుఁ జాల నగ్గమై యెసన నతని
యుక్తి సాధింపు' డని పంపెను.

అంత చెలులు భీమనాయకునకు, చెప్ప నలవి కాని దమయంతీ విరహ వేదనను తెల్పిరి. అంత రాజు స్వయంవరమును ప్రకటించుట, రాజకుమారులు రమణిని గోరి వచ్చుట, దేవలోకమున నారదప్రేరితులై ఇంద్రాగ్ని వరుణ యములు స్వయంవరమునకై బయలు వెడలుట, నలుని గాంచుట, దమయంతి కడకు దూతగ నలుని పంపుట, పూర్వసదృశము.

నలుడు నిర్జర దూతయై ప్రేష్య వృత్తితో దమయంతి అంతిపురమునకు చేరును. ఈ సందర్భమున కవి నూతన మార్గము నవలంబించి యున్నాడు - దమయంతిచే చేయబడిన చిత్తరువు వలె నలుడు దమయంతిని చూచుటను గాంచి దమయంతి వానిశక్తికబ్బురపడి నీవెవడవని అడుగును. నలుడు తనపేరు చెప్పక తావచ్చిన కార్యమును విన్నవించును.

అంత దమయంతి భూకాంతునితో :

'ఘనదేవేంద్ర విభూతి యొల్ల! నజరా
కారత్వ మేనొల్ల! నా
కు, నలప్రాయము జీవనం బితర వా
గ్దుంభంబు లింకేటికిన్.'

అని తన నిశ్చితాభిప్రాయమును తెల్పగ అంత నా నిర్జరదూత 'నేను 'నలుడను' అని తెల్పును. వెంటనే దమయంతికి సిగ్గు దొంతరలు చిందులు ద్రొక్క, 'అవని కాంతానుషక్తి నిలచి' 'మహీకాంత రమణి హృదయాంతర చలాచల స్థితి నధిగమించి 'అద్భుతసుఖానుభవముమనంబునం బెనుప పల్కె ననుంగు వెలంది పల్కులన్'

చక్రపురి రాఘవాచార్యుడు :

నలుడు దేవదూతగ అంతఃపురమున ప్రవేశించి దమయంతిని -

'నవరత్న మయమైన నగరిలో నుండ
గనుగొని దానిదగ్గరబోయి నిలువ
వనజాక్షి గాంచి భావజు డంచు బెదరి
భ్రమనొంది ధరమీద బడి మూర్ఛ పోయి.
కమలాక్షి యంతతో గ్రక్కున తెలిసి
కనుగొని నలరాజు గాబో లటంచు
మనమున తెలిసి హేమ స్తంభ మొకటి
చాటుగా నిలచి యచ్చట నున్న తనదు
చేటిని సైగ సేసిన నది వేడ్క
జననాథుతో పల్కె సరస వాక్యముల.'
(న. చ. ద్వి. 210-18)

ఆంధ్ర మహాభారతమున - దమయంతి నలునితో ఇంద్రాగ్ని యమవరుణులసమ్యక్స్వరూపమును గాంచి ఆ బృందారక మూర్తిని 'నీవు మహానుభావుండ వెవ్వండవు?' అని ప్రశ్నించుట ప్రారంభించుటచే అట్టి దేవత యందు 'లజ్జయు డిగ్గి భీతిల్లక' పోవుట సముచితమే అనిపించును. అట్లయిన దమయంతి మదన ప్రేరిత యగుటకు కారణము - నలుడు స్వతః స్మరద్రూపి (నకులునివలె సుందరుడు) ఆ సౌందర్యగరిమను దమయంతి హంస వలన పూర్వమే వినియుండుటచే, నలుని కాంచిన వెంటనే రాగోదయ మగుట సహజము. రాగోదయము మదన ప్రేరితత్వమునకు ఆలంబనము.

శ్రీనాథుని దమయంతి 'ధీరోదాత్త' అగుటచే పరపురుష ప్రవేశము నిషిద్ధమైన ప్రాంతమున, సమయమున, ఆగంతుకునికి 'అతిథి సత్కార విధి నిర్వహణ క్రియాసక్తత' అంత సముచిత మనిపించుకొనదు. అందులకే రామరాజభూషణుడు వారి ప్రథమ పరస్పరదర్శనమును ఈ విధముగ వర్ణింపలేదు.

రామరాజ భూషణుని దమయంతి 'వివేక సన్మణీఖని' ఈమెమాటలలో శృంగారము కన్న రాజరికము మిన్న. ఈమె, దేవదూతగా వచ్చినవాడు నలుడని తెలిసిన వెంటనే వానితో మాటాడక తెరచాటుగ నిలచి చెలికత్తెచే పలికించిన దట.

రాఘవాచార్యుని దమయంతి - నలునూహించి విరహతాపముచే ముమ్మారు మూర్ఛ పోయిన ముదితకు నలుని కాంచినంత మూర్ఛ నొందుట అచ్చెరువు కాదు. ఇది సుకుమారాతిశాయకము. ఈమె ముదిత కాదు ముగ్ధ, వచ్చినవాడు నలుడని -

'మనమున తెలిసి హేమస్తంభ మొకటి చాటుగా నిలచి' చెలికత్తెచే నడిగించుట రామరాజ భూషణునకు అనుసరణము.

— • • • —

భావ విప్లవసారథి దాశరథి

# తిమిరంతో సమరం

- శ్రీ డా. జి. బి. యస్. ఆచార్య, ఎం.ఏ.; పిహెచ్.డి.

( గతసంచిక తరువాయి )

ఏవుపదేశాన్నైనా విని ఆచరించడానికి మనస్సు ప్రధానం. అందుకే

'నదిలేని ఊరు
గదిలేని ఇల్లు
పొదలేని అడవి
ఎదలేని మనిషి
ఎవడికి కావాలి?

అని మృదువుగా మందలించాడు దాశరథి. మనస్సును పెంచుకోమన్నాడు; అప్పుడే మనిషి వవుతా వన్నాడు. సుఖం కోసం ముఖంవాచి, శాంతిలేక గొంతెండి, ఎంతకాల మిలా పండివుంటా మని, తనలోతాను తర్కించుకొని, చివరకు సహనాన్ని విసర్జించి, విజృంభించటానికే నిశ్చయించుకున్నాడు.

ఆనిశ్చయంతోనే -:

'సత్యాన్ని హత్య చేసిన వారిని
గత్యంతరం లేక లొంగదీస్తాను
మృత్యువును దండిస్తాను
చైతన్యాన్ని పండిస్తాను.'

అని శపథం చేసాడు. మరి ఈ శపథం చెల్లించుకోవాలంటే -

'నేను రావణాసురునికి రాముణ్ణి
నేను త్రిపురాసురునికి శివుణ్ణి
అందుకే పెన్ను జేబులో పెట్టాను
గన్ను చేత పట్టాను'

అని అనవలసివచ్చింది. క్రాంతి జీవితమే తన ధ్యేయం కనుక ఎవరేమి చెప్పినా వినిపించుకునే స్థితిలో లేనన్న మొండి ధైర్యాన్ని కూడా ప్రకటించాడు. దీన్ని బట్టి దాశరథికి కేవలం వాక్శూరతే కాదు; అవసరమైతే కార్యశూరత కూడా ప్రదర్శించగల గుండెబలమూ, కండబలమూ వున్నాయని తెలుస్తుంది. అసలు పెన్ను కన్నులో కాపురమున్న తనచే గన్ను పట్టించినది ఈ హింసాజగత్తే అని ఆవేదన పడతాడు. అయినా -

'కన్నులలో ఆశాజ్యోతి
పెదవులపై జాతీయగీతి
హృదయంలో మాతృప్రీతి
చేతిలో మిత్తిని నరికే హేతి'

కలిగివుండటమే దాశరథి విశిష్టత. నవకవితాపతాకతో, యువకవితాశశిరేఖతో, అజ్ఞానాంధకారాన్ని అణగిస్తూ, అమాయకుల ఆక్రందనను తొలగిస్తూ, పదవీ దాహదావానలాన్ని చల్లారుస్తూ, అవకాశవాద పిశాచాన్ని హతమారుస్తూ అపరిపక్వమైన పల్లవాండాన్ని అవియించజాచే వినతల్ని అనాదరిస్తూ, కాలచక్రాన్ని వెనక్కి తిప్పాలని, కడు ప్రయత్నం చేసే కాలాంతకుల్ని కాలరాస్తూ - భవిష్యత్తు రావాలని ఆశిస్తూ -

శ్రమ జీవులు
బుద్ధి జీవులు
సమ సమాజస్వప్నాన్ని
సత్యం చేయగల, నిత్యం చేయగల
అత్యంత శక్తి స్వరూపిణి
కాత్యాయని నా భవిష్యత్తు!
ఆ కాత్యాయనిని వరించే
కాలకంఠుణ్ణి నేను!

అని ఉద్రేక పూరితంగా, తన విశిష్ట వ్యక్తిత్వాన్ని ఆవిష్కరించాడు. దుష్ట శిక్షణ కోసం దైవత్వాన్ని వరించటంలోని ఆవసరాన్ని, ఆనందాన్ని నేర్పుతో వెల్లడించాడు.

నమ్మిన సిద్ధాంతాలకోసం వమ్మయిపోయిన అజ్ఞాతయోధుని గూర్చి కవిత అల్లుతూ -

'తామ్ర పత్రం కోరలేదు
ఛాయాచిత్రం నోచలేదు
అతనికి కావలసింది దేశం
అతని నరనరాన ఆవేశం'

అని నిజమైన దేశభక్తుని వ్యక్తిత్వాన్నే విశిష్టరీతిలో సంభావించాడు. ఈవ్యక్తిత్వాన్నే అందరూ ఆదర్శంగా గ్రహించాలనే సందేశాన్ని ధ్వనింప చేసాడు.

సమరరాక్షసిని నశించి, శాంతిదేవత హసించి, స్వాతంత్ర్యం, సౌజన్యం, సౌభ్రాత్రం వసించా లని ఆశించిన దాశరథి -

'ఒక్క తెలుగు - ఒక వెలుగు - అనే శీర్షికలో -

'నీకంటిని నీవు పొడుచుకుంటావా!
నీయింటిని నీవు కాల్చుకుంటావా!
కుంటికాలితో నడిచే కోర్కె ఉన్నదా
జంటబాసి బ్రతుకుటలో శాంతి ఉన్నదా?

అని సమైక్యాన్ని బోధిస్తూ - ఆ సమైక్యంలోనే 'శాంతి' వున్నదనే సందేశాన్ని అందించాడు. లోకంలో శాంతి కాంతులు వెల్లి విరియాలంటే సమైక్యమే శరణ్యం. దానికున్న శక్తి మరి, దేనికీ లేదు. అందుకే -

'నిజం తెలిసి, భుజం కలిపి
నిండుమదిని సాగాలి
పరిష్కారమును త్వరలో
తెరబయటికి లాగాలి.
ఒకదేహం, ఒక గేహం
ఒక దేశం మనది
తెలుగు వెలుగు దశదిశల
దీపింప గలది.'

అని మరోసారి తెలుగు వెలుగు విశిష్టతను, సమైక్య విలక్షణతను కొనియాడినాడు, అయినా -

'ఇవాళ ఒక జెండా
రేపు మరో జెండా
ఇవాళ ఒక గూండా
రేపు మరో గూండా

ఈ గూండాల జెండాల దెబ్బలకు
నాగుండె ముక్కలై పోయింది.

అని ఆవేదన చెందుతూ –

'లక్ష దీపాలతో
కక్ష కట్టిన
ఓ యక్షకన్యా!
నీ దీపాలను మించిన
దీన జన సందోహం గుండెల్లో
కోపాలు మండు తున్నాయి.'

అని దీనజన పక్షం వహించి, వారి రక్షణకై కంకణం కట్టుకున్నాడు. పీడిత ప్రజలు ఏదో ఒకనాడు తిరగబడక మానరు. అతిరుగుబాటుతో దుష్టశక్తి నాశనం కాక తప్పదు. అనే ఆశాభావాన్ని వెల్లడించాడు.

'నాకు కావలసింది రెండుకళ్ళు
కరగ గల కళ్ళు
వెలగ గల కళ్ళు
వెలిగించ గల కళ్ళు
మనస్సులోని అంధకారం
మటుమాయం చేయగల కళ్ళు'

అని, తనకు కావలసిన అజ్యోతిర్నయనాలను వెదకటం కోసం – లక్షదీపావళులనైనా దాటి వెళ్ళగల దీక్షను ప్రకటించాడు. మనను కూడా ఆ జ్యోతిర్నయనాల అన్వేషణలో నిరంతరం నిమగ్నం కావాలని హెచ్చరించాడు. అవి దొరకే దాకా అన్వేషించటం మనకర్తవ్యం, అవి దొరికిన నాడు మనబ్రతుకే దివ్యాతి దివ్యం.'

'గడియారం నడవని
పాతకోట గోడకన్న
సూర్యుణ్ణి ఉరికించే
ఫ్యాక్టరీ కూత మిన్న.'

అని దాశరథి – పారిశ్రామికాభివృద్ధిని సమర్థిస్తూ, కార్మిక లోకపు కల్యాణానికి మంగళగీతికను పాడాడు.

'లయ మన్నది లేదని
జయ మన్నది కలదని
శమదమముల అమృతంతో
క్షమ విరియుట తథ్యమనీ'

విశ్వమానవ విజయగీతికను, విశ్వాంతరాళాల్లో ప్రతిధ్వనింప చేసిన దాశరథి–

'పట్నాలను పల్లెలను
శ్మశానాలుగా చేసి,
మధువులు పారేచోట
రుధిరాలను ధారబోసి
కవితలు వికసించుచోట
కత్తుల తోటలు నాటి
నాకము వంటి ధరిత్రిని
నరకం చేశాడు మనిషి'

అని నొచ్చుకున్నాడు. మనిషి చేస్తున్న అమానుషపు చర్యలకు ఆవేదన చెందాడు. సాయుధ విప్లవాన్ని నిరసించాడు. ఇంకా –

'నాగమల్లి పొదలోపల
నాగజెముడు మొలిచాడు
కాలకంఠుని గుడిలోపల
కాలయముడు వెలిశాడు,
రంభలుండగల మేడలు
బాంబులతో నింపాడు
నరుడే నరకాసురుడు
అతని మెదడు, మృతికి పురుడు!'

అని విధ్వంసక చర్యలకు పాల్పడి నీచ మానవుణ్ణి దెప్పి పొడిచాడు. క్రూరులతో పోల్చి – కుమల పొడిచాడు. ఇంతకంటె తాను మాత్రం ఏం చేయగలడు?

'ఈ విషాలధాత్రిలో
ఈ చీకటి రాత్రిలో
హింసపైన కోపాలు
ఈ చిన్ని దీపాలు
వెలిగించే ఇల్లాలు
ఒక్కతె ఉంటే చాలు
జ్ఞాన కాంతి కిరణాలు
జగతి నంతటను ప్రాలు
విరియును శాంతి సుమాలు
కలుగును కవికి జయాలు'

అని కవిగా, శాంతి కాముకత్వాన్ని వెల్లడిస్తూ, విజయాన్ని ఆశించాడు. దాశరథి ఆశించిన విజయం కలగాలంటే 'హింస' విధ్వంసం కావాలి. 'అహింస' హంసై విహరించాలి. దీనికి జనావళి సమైక్యంతో కృషి చేయాలి. ఇంకా

'ప్రతి యెదలో మహాత్ముడే
ప్రతిష్ఠితుడు కావాలి.
అతని అడుగు జాడలందు
అఖిల జగం నడవాలి.'

దాశరథి కూలి జనపక్షపాతి, బూర్జువా తత్త్వాన్ని నిర్వసిస్తూ –

'కష్టించని వారికి
కట్టలం కట్టలు ధనము,
కష్టించే వాడికి
ముష్టిగింజలే ఘనము.'

అని కూలివారి దయనీయజీవితాన్ని తలచుకొని బాధపడ్డాడు. మనిషికింత విలువిచ్చే మంచిరోజు 'ఓటు' తోగాని, 'తూటా' తో గాని రాదనీ –

'నిన్ను నీవు తెలుసుకొని
నీ కన్నులు తెరుచుకుని
విజృంభించినప్పు డదే
విప్లవమని నేనంటా.'

అని విప్లవానికి తనదైన నిర్వచనం ఇచ్చాడు. దీన్నిబట్టి దాశరథి దృష్టిలో 'హింస' తో విప్లవం రాదని తేలిపోతుంది.

'తూర్పులో మార్పువస్తే
అది మార్పుగా గుర్తించని అంధులు
మారణ హోమం శమిస్తే
అది శాంతిగా అంగీకరించని జరా
సంధులు, ఉగాదిమాట వింటారా?'

అని రుధిరసుమమాలిక, చైతన్య ప్రతీక, వైప్లవ్య పతాక అయిన నవవత్సర గీతికను ఆలపించాడు.

'పడగొట్టండి పాడు గోడల్ని
పోగొట్టండి ఈ పీడల్ని
దిగనివ్వండి మమతల మత్తే ఊడల్ని
ప్రాకనివ్వండి చల్లని చెలిమి నీడల్ని'

అని మానవత విలువలను బోధించాడు. దాశరథి సమకాలీన సమాజాన్ని బాగా పరిశీలించి, పరిస్థితులను అవగాహన చేసుకొని –

'ధాన్యం తరిగే వేళ
సైన్యం పెరిగే నేల
సైనికుడే సైరికుడై
సాగు చేయవలె నేల

అని అధికోత్పత్తికి పరిష్కారమార్గాన్ని చూపించిన మేధావి – బ్రతుకు తెరువుకు మార్గం చూసుకోవాలి కాని, కోట్లధనం ఖర్చయి బ్రతుకు వినాశనం చేసే యుద్ధాలు చేయటం కాదు. అని హిత బోధ చేసి –

'తుపాకీల పాతం చేసి
కృపా కీల వెలిగించు'

అని జనతను జాగృతం చేసాడు.

సమకాలిక సంఘటనలకు కదిలి, గళమెత్తి ప్రజలను ప్రబోధించే ప్రజాకవిగా, బంగ్లా యుద్ధం, వియత్నాం విప్లవం, తెలంగాణ ఉద్యమం మొదలైన ఎన్నో సంఘటనల వల్ల స్ఫూర్తి తెచ్చుకొని, తన కవితా మూర్తిని వెలిగించుకొని, కాలంతోపాటు వాటిలో తాదాత్మ్యం వహించి, గొంతు విప్పి, తన సందేశాన్ని చాటి చెప్పగలిగిన చైతన్య కవితా పయోనిధి – దాశరథి !!

'తిమిరంతో ఘనసమరం
జరిపిన బ్రతుకే అమరం
కవితా తేజోవలయం – .
అవనికాంతి కది నిలయం

అని కావ్యానికి ఘనస్తుతిని పలికాడు. తిమిరంతో తాను సమరం చేస్తూ, మనను కూడా చేయమని బోధించాడు. హృదయ స్పందనగల ప్రతి వ్యక్తి దాశరథిని అనుసరించి, తన బ్రతుకును అమరం చేసుకో గలడని, చేసుకోవాలని ఆశించటం సమంజసం !!

—•••—

# ఆంధ్ర కవులు - అభ్యవహార పద్ధతులు

– శ్రీమతి భాషాప్రవీణ కె. వి. రంగనాయకి, ఎం. ఏ.

ఇక మహాంధ్రులకు పండితులకు పెద్దలకు కావించెడి విందు వేరు. ఆయతిథులకును మొగమోట ముండదు. 'ఆహారే వ్యవహారే చ త్యక్తలజ్జః సుఖీభవేత్' అని వారిపద్ధతి.

వారు భోజనము చేయు ప్రదేశములను గోమయముతో నలికి ముగ్గు తీర్చ వలయును. కస్తూరి నీరు చల్లవలెను. అచట వృద్ధానుపూర్వకముగా పీటలను వేసి ఆకులు పఱచవలెను. అవి యెట్లుండవలసినదియు ముందు చెప్పితిని కదా! ఆయాకులలో పాత్ర సంశుద్ధికిగా నభిఘారము చేయవలెను. అప్పుడు వడ్డనలు సేయవలెను. ఆపోశనములు వడ్డించిన పిమ్మట పారణ ప్రారంభమగును.

ఆయాతిథ్యమున పప్పు, పిండివంటలు, పాయసము. ఇక శాకములు పలువిధములు లభ్యములైనంతవరకు వండి వడ్డింపవలసినదే. భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య, పానీయాదు లన్నియు ఆ యతిథు లడ్డము పడువరకు గ్రుమ్మరింపవలసినదే. అప్పుడు గాని వారికి తృప్తి లేదు. ఆతిథ్యమునకు పూర్ణత లేదు

ఆ శాక పాకములకు సరిపడిన అన్నము కావలయును. అది ప్రధానము. మిగిలినవి వ్యంజన మాత్రములు. ఆయన్నము సన్న బియ్యములో వండినది, కప్పురపు వాసనలు విరజిమ్ముచున్నదియుగా నుండవలయును. తాలింపు వాసనలు ఆ యూరెల్ల గుబాళింపవలసినదే.

తెల్లని జాజులవంటి కలమాన్నములు, ద్రాక్షాపానకములు, ఖండశర్కరలు, రంభాఫలములు, గోక్షీరములు, మండెగలు క్రొత్తగా నప్పుడే గాచిన కరియాల నెయి, అన్ని రకముల చాయపప్పులు. ఈ పదార్థములతో నక్షునిండుగా నారగించి తీరవలసినదే. లేదా ఆ గృహస్థు తృప్తిచెందడు. అప్పుడు అతిథులు చేతులు కడుగుకొని వార్చి విశ్రమింతురు. వారుభోజనము చేయుచున్న సమయములో గోవిందనామ స్మరణము చేయవలెను.

ఆ గృహస్థులు ఈ యతిథులకు యథాశక్తి తాంబూలము సమర్పింతురు. అది కర్పూర తాంబూలము. జాజికాయ, జాపత్రి, కస్తూరి, పచ్చకర్పూరము, ఏలక్కాయలు, చల్లమిరియములు, లవంగములు కొన్ని. కుంకుమపూవు ముఖ్యాతి ముఖ్యము. ఆ తాంబూలముతో గాని ఆతిథ్యము పూర్తి గాదు. ఎంతటి భోజనమైనను తాంబూలము లేక అసారమే యగు నని మహాకవి తీర్పు.

ఈ తాంబూలము చాల రకములుగా నున్నది. స్త్రీల తాంబూలము వేరు పురుషుల తాంబూలము వేరు. దంపతుల తాంబూలమే వేరు. ప్రవాసమున నున్నప్పటి తాంబూలము వేరు.

ప్రవరుడు వరూధినియొద్దకు వెళ్ళుటకు త్రోవ చూపినది ఈ తాంబూల వాసనయే. ఆ తాంబూలపు వాసనతో ఇచట స్త్రీ లున్నారని పసిగట్టినాడు. అది 'మృగమద సౌరభవిభవ ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీగంధ, స్థగితేతర పరిమళము.

ఈ తాంబూలము భారతీయులకు ఒక సిద్ధాంత పథము. ఇది నేటివారికి తలత్రిప్పి సొక్కు తెచ్చుచున్నది.

ఇదియంతయు ఆతిథ్యమే. ఇది శ్రీనాథుని కాలము నందలి భోజన విధానము.

పలనాటి సంచారమున సార్వభౌమునకు అచ్చటి వారిమీద కొంత ఏవ పుట్టినది.

'రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభయైన నేకులె వడకున్.
వసుధేశుడైన నున్నను
కుసుమాస్త్రుండైన జొన్నకూడే
కుడుచున్.
జొన్నకలి జొన్నయంబలి
జొన్నన్నము జొన్నపిసరు
జొన్నలె తప్పన్
సన్నన్నము సున్న సుమీ
పన్నుగ పలనాటిసీమ ప్రజలందరకున్.'

సజ్జ జొన్న కొర్ర సర్పములును తేళ్ళు అని నిరసించినది సార్వభౌముని మనస్సు. ఇది ఆనాటి భోజనస్థితి.

ఇక ఆ తరువాత మహాకవిగా భక్తునిగా పేరొందిన పోతనామాత్యుని భాగవతములో చల్దులారగించే విధానము చక్కగా వర్ణింపబడినది. పరమాత్మ గోపాలకులతో గూడి చల్దులారగించినాడు. ఆ ఆరగించే విధానము నోరూరించే తీరుగా నున్నది. అంతటి పరమాత్మ చల్దులారగించు టేమిటో? దానికిని ఊరుగాయ అనుపానము. ఇది మరీ ఆశ్చర్యము. గొల్లల కింతకంటె ఆహార మేమి దొరకును?

గోపాలకు లందరూ ఎండలో మగ్గి కృష్ణుని చుట్టూ వలయాకారముగా కూర్చుండి ఆకుల పల్లవములు కంచములుగా భుజించుట మొదలిడిరి. వారు భుజించునది ఊరుగాయ పెరుగన్నమైనను వారు దానిని అమృత పంచభక్ష్య పరమాన్నములకన్న ఆనందముగా భుజించిరి.

మాటి మాటికి వేళ్ళుమడిచి ఎగుటి వారి నూరించుచూ ఒకడు ఊరుగాయలు తినుచుండ వేరొకడు పక్కవాని కంచములోని భోజనము మ్రింగి లేదని నోరు మూయుచుండును. ఒకడు కూర్కొని కూర్కొని చల్దిని భుజించగలడు. కృష్ణుని చూడుమని వానిభక్ష్యరాశి నెల్ల ఒకడు భక్షించెను. ఇట్లు వారు చల్దిని భుజించిరి. వెనుకటి మహాకవులు పదార్థముల సంఖ్య నధికముగా చెప్పిరి. ఈతడు సంఖ్యా విభాగమున తక్కువ చెప్పినను చదువు వారికి చవులూరునట్లు వర్ణించినాడు. ఈ చవులు ఆరగించవలయునని బ్రహ్మయు, పరమేశ్వరుడు, దేవతలును, కాకగోపాలములతో నిల్చినారని అద్వైతసిద్ధి గ్రంథకర్త యగు శ్రీమధుసూదన సరస్వతి చెప్పినాడు.

ఆ తరువాత అబ్బయామాత్యుని కాలము నాటికి విందులలో కొంత మార్పు వచ్చినది. పరమాన్నములు పిండివంటలు, సూపంబుల్, గమాయించు పండ్లరసములు, మధురామ్ల శాకములు, బెల్లంబు, ఆజ్యము, తేనె, కప్పురంపు దోయము, మీగడల్, పెరుగులు, ఉప్పూరగాయలు, ఈ పదార్థములతో పెండ్లి విందులు ఆతిథ్యములు సాగెడివి.

ఇక అనంతరము రాయలనాటి రసికతాజీవనమును గమనింతము. అప్పటి వారు నిత్యతృప్తులు. నిత్యభోగులు. ఏయే ఋతువుల నేయే భోగముల నెట్లనుభవింపవలెనో వారట్లే యనుభవించినవారు. వారికి భోగముల యందెంత మక్కువో త్యాగమునందును అంతియే. వారు చేయ దలచినదానిని అనుభవింప దలచిన దానిని తుదముట్టక యాగని నిశ్చయము కలవారు.

ఆకాలము లందు వైష్ణవాతిథ్యము లిట్లుండెడివి. అవియు న్యాయార్జితములైన విత్తములతోనే జరిగెడివి.

చైత్ర వైశాఖ జ్యేష్ఠాషాఢములందు కొంచెము వెచ్చనై తెల్లనిజాజి మొగ్గల వంటి కలమాన్నము (అవి తుంగభద్రానది కాల్వలో పండినవి.) చారులు, మజ్జిగ పులుసులు, పచ్చియంబళులు, చెఱకు పాలు, టెంకాయనీరు, అరసెలు, మామిపండ్లు. చల్లని కమ్మని నీరు, పల్చని కొంది మజ్జిగలు ... ఆకాలము వారికి ప్రీతిపాత్రములు. ముందుగా పరిమళచ్చందనచర్చ గావించెడి వారు.

శ్రావణ భాద్రపద ఆశ్వయుజ కార్తీకములు గగనము నీటిబుగ్గగా ముసుళ్ళుపట్టి వేధించునపుడు అంతఃపుట్టలతోనే అతిథి సంతర్పణములు గావించుటకై వంటకములు చేయించెడివారు. పాపము వారికి కూరలు అంతగా ఆ జడిలో దొరకవు కావున చారుపప్పులను వండుదురు. (నాలుగైన తిరుగబోత తాలింపులు) వేపిలో జాగ్రత్త పెట్టిన వరుగులు కావలసినన్ని యుండును. వడియము లప్పడము లున్నవి. అలపాడి వలసినంత. కూర లంతగా దొరకని లోపమును దధి ఘృతములు పూరించును.

విసువుట లేక బాధల కోర్చి ఆ జడివానలో వారు ఆతిథ్యమును పాలించెడివారు.

ఇక మార్గశీర్ష పుష్య మాఘ ఫాల్గునములు. పునుగు జవ్వాజీ వాసనలు గుబాళించు తుంగభద్రానది నీట బండిన సన్నబియ్యమును వండి మెరపకారమునకు బదులుగా మిరియంపు గారమును జల్లి గావించిన తాలింపు ముకుపుటముల నాదు పుట్టింపగా; ఆవలు పెట్టిన పచ్చళ్ళు, తీయతీయని పాయసములు, ఊరుగాయలు, బజ్జీలు, పిండిమిరియములు, (వీనిని పెరుగు ప్రధానముగా చేయుదురట.) చేయి చుఱుక్కను నేతితో, మరగ గాగిన పాలతో సీతువున నాహార సేవనము జరుగును.

ఇక శనివారములలో అరటిపూవుల వంటి దొప్పలలో (ఇవి వారి దేశ సమయానుకూలములు) నూనెలు, నలుగు బిండి యుంచుకొని నదులలో అభ్యంగములు గావించి వచ్చెడి అతిథి కోటికి వారు ఎంత ప్రొద్దుపోయినను విసుపుకొనక భోజనములు వడ్డింతురు.

అప్పటి వారికి వ్రతపాలనము నందు భక్తి, శ్రద్ధ, మెండు.

ఆనిష్ఠా నిధి గేహసీమ నకారే
యాలించిన ద్రోణము నెం
తేనాగేంద్ర శయాన (ను) పుణ్యకథలుం
దివ్యప్రబంధానుసం
ధానధ్యానము నాస్తిశాక బహుతాం
నాస్త్యుష్ణతాం నాస్త్యపూ
పాకాస్త్య్యన సౌష్ఠవం చ కృపయా
భోక్తవ్య మస్మాటలున్'

వారియిండ్లలో అర్ధరాత్రములందు విన్నను అయ్యా! అన్నములు చల్లవడినవి. కూర లెక్కువలేవు. భక్ష్యములు సేయు వ్యవధి లేదు. ఆతిథ్యము సరిగాలేదు. అని అతి వినయముతో భక్తితో అతిథులకు విజ్ఞాపనము.

ఇది వైష్ణవసామాన్యమైన ఆతిథ్యము. క్షత్రియ భోజనములు వేరు. భోగానుభవములందు ఆసక్తిగలుగు స్త్రీలు, పురుషులు చేపలను ముదురు పచ్చి మామిడి ముక్కలతో తాలింపు వేసి (నువ్వులనూనె) తడి యిగురగనే దానిని వారందరూ తృప్తిగా మెసవుదురు. చేపల కనరు పోవుటకుగాను తడియిసుకలో పాతిపెట్టిన లేత బొండముల నీటిని సాయంకాలమునందు త్రాగుదురు. అప్పటికి గాని వారికి వారికి భోగాసక్తిలో తృప్తి గలుగదు.

ఇక పంటకులుగూడ తోటలలో పగలు మల్లెపూలు కోసుకొని సాయంకాలమగుసరికి చెఱకు పానకములకై ఇక్షుయంత్రములకు వత్తురు. చెఱకుపాలు పుచ్చుకొందురు.

తిరునాళ్ళలో సత్రములందు, పురోహితుల యిండ్లయందు భోజనములు పెట్టుదురు. ఆ భోజనములు, ఫలహారములు నిట్లుండును.

పరిపక్వసురభి రంభా ఫలంబులు, పండిన పనస తొనలు, వెన్నముద్దలనంటి చెఱకు ముక్కలు, చాలరకములైన మామిడి పండ్లు, ద్రాక్షపండ్లు పొట్టొల్చిన వడపప్పులు, పండిపగిలిన పెద్ద దానిమ్మ గింజలు, రసదాడి యరటిపండ్లు, పానకములు, చందనము, కర్పూరతాంబూలములు. వారు సేవించిన తాంబూలపు కర్పూరవాసన ఆ వీథినంతను గుబాళింపజేయునట.

ఈ భోజనములు చేసిన వారందరూ ఒకచోట చేరి యేవో పద్యములు, పాటలు, కథలు చెప్పుకొనుచుండెడివారు. ఇప్పటివలె మాటాడరాదన్న మౌనవ్రతము నాటి వారికి లేదు.

ఆకాలమున పొరుగూరికేగునపుడు భోజన సామగ్రిని వెంటకొనిపోవు నాచారము శిష్టులది. బంధుగులు లేనిచో వారి దేవతార్చనాదులకు సాగదు. సత్రములందు వారు భుజింపరు. అందువలన ఆయా సామగ్రిని వారు జాగ్రత్త పరచుకొని మరీ వెళ్ళుదురు.

క్రొత్తబియ్యము పరగ్రామవాసమునకు సరిపడవు. కావున ప్రాచీన తండులములను పొట్టూర్చి చెరగి మూటకట్టెదరు. చింతపండు గింజ, యుట్టి, లేకుండ చేసి బెల్లమున కలుపువారట. దానియందే జీలకఱ్ఱ మొదలగునవి కలిపియుంచుదురట.

వంటసామగ్రి కాళ్ళ కిటునటు నేతి లడ్డిగములను వ్రేలాడదీయుదురు. పాలు తోడు పెట్టుకొని పోదురు. పెరుగుకలిపి పెట్టిన వడియములు, వరుగులు, చాయ పప్పులు - ఇంత సర్దుబాటుతో బయలుదేరుదురు. లేదేని వారికి దేవతార్చనలు సాగవు. ఆహితాగ్నులైనవారు అగ్నులను కూడ కొంపోవుదురు. కొందరు మధుసూదనార్చనోపకరణము లేక యింత సంబారమున్నను 'అమృతమస్తు' అనరు.

మహారాజులు వాన కారులందు కాపించెడి అభ్యవహారము వేరు. వారివారి వడవడికలు వేరు. మణియష్టి యందలి మత్తమయూర ధ్వనులను విని కాని వారు మేల్కొనరు. అప్పటికే సూర్యోదయమగును.

ఆపైని గుమగుమలాడు సుగంధి తైలములతో నంగమర్దనము జరుగవలెను. తరువాత కాగిననీరు. ఆనీరునందు పన్నీరు కలియరాదు. తెల్లని వస్త్రములు, మొగలిరేకుల బన్నసరములు ధరింతురు. అప్పటికి జాము ప్రొద్దెక్కును. ఆపైని కొలువు. ఆ కొలువు తీర్చుకొని వచ్చునంతలో వంట చేయువారు అడవి పందిమాంసమునో, కొండ ఉడుము మాంసమునో, కౌజు మాంసమునో చక్కగా ఆనాడు కాచిన ఆల నేతితో వ్రేల్చియుంచెదరు. దానిని పలావుబియ్యముతో వండిన యన్నముతో నేయి యెక్కువగా వేసుకొని భుజింతురు.

వర్షకాలమున మాత్రము కస్తూరి హెచ్చుగా తాంబూలము సేవింతురు. అగరుధూపములు దట్టముగా నుండవలయును. మేడలో నున్నపుడు గవాక్షములనుండి వచ్చెడి మెరపు కాంతులలో అంతఃపుర రాణివాసము వారి చూపులు వాలిపోవును. ఆ యువరోధములతో నగుచుందురు.

ప్రభుత్వములేని సామాన్యులు ఆ జడి యొద్దడిలో గురుగు చెంచలికూర తగిరిసాకును తెచ్చి చింత చిగురుతో మర్దించి చెరగి పుల్లపుట్రటతీసి నూనియలతో పొరటుదురు. ఆరిగల కూడు ఆవిరివచ్చుదానినే ఈ కూరతో తిని మంచములపై ప్రాలుదురు. వారిమంచముక్రింద మేక పెంటికల తోడి మట్టికుంపటి యుండును వెచ్చదనమునకు. అది వారికి ప్రభుత్వపు సొంపునే కలిగించునట.

ఈ ప్రస్తావనమున చిన్న మనవి. శ్రీకృష్ణదేవరాయల రాజ్యమునకు పూర్వము రెడ్డిరాజ్యము. ఆ రెడ్డిరాజ్యమును గాయలు వానకారు వర్ణనముతో జోడించి కొంచెముగా పరిహసించి వెంటనే మహారాజ వైభవమును దీర్ఘసీస పద్యమున వివరించినాడు. కాని అతని ప్రాభవమును వర్ణించుకొన్న పద్యము తోనే వర్షాంత మగుట, శరత్తు ప్రవేశించుట తాను గమనింపలేదు. ఆపద్య మిది

'రాజపురంధ్రీ లబ్ధ
 గంధము శారివనీ శరావలీ
వైజననంబు యజ్ఞాహుత
 వాజపలు కోరుచు భాస్వదిందిరాం
భోజ సమాగమం బుదిత
 గోష్ఠ భుజంగ శయోపచారనీ
రాజనస్రల్ల హల్లక స
 రం బుపయించె శరద్దినం బిలన్'

ఆనాటి వారికి అతిథి సంతర్పణమే ముఖ్యము. పగ్గసగవాసు లే తెంపుకు పోవు గని విన్నవారెంత దూరస్థమైనను పిలుచుకోయి భక్తి తలవంచి ప్రార్థించి వచ్చెడివారు. సంతృప్తిగా నాతిథ్య మిచ్చెడివారు.

వేయిమంది ఒక్కసారి వచ్చినను ఆనాటి మైత్రేయులు భర్తలతో రుసరుసలు పోయెడివారు కారు. విసుగు లేనే లేదు. అన్నపూర్ణాదేవివలె నెందరు వచ్చినను ఎంత వేడినను ఆకులపై వడ్డనపును వరకు వడ్డించి తీరెడివారు. ఆత్మకింపయిన భోజనము లేక వారు తృప్తి చెందరు.

ఆకాలము వారి భోగసామగ్రి యిది. అప్పుడే కస్తూరిమృగము బొడ్డునుండి తొలగింపబడిన కమ్మని గుమగుమలాడు జవ్వాజి, పొగలెత్తి ఘనసార వృక్షముల నుండి తనంతతానుగా విరిసి జారిన పచ్చ కప్పురము, గొజ్జగి పూపొదల మీదుగా పటికంపు తొనలను నిండించిన పన్నీరు. మేలిపూలు. కల్పవృక్షము నుండి వచ్చిన మంచి దువ్వలువలు. ఫలములు. కోరిన భూషణములు.

భోజన మేదియైనను ఆత్మకింపుగా నుండవలెనట. భోజనానంతరము వారికి పచ్చకప్పురపు విడెము కావలెను. అది రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చినచో ఇబ్బడి ముబ్బడి మున్నట.

( సశేషం )

# తెలుగు వారు - ఒరియా భాషా సేవ

- శ్రీ వెలుదండ నిత్యానందరావు, ఎం. ఏ.

( గతసంచిక తరువాయి )

ఫతురానంద గారి 'పోలింగ్ రోజు' ను శైలజగారితో కలిసి కామేశ్వరిగారు విపుల జూన్, 30 సంచికలో వెలయించారు.

'పల్లెటూరు మన భాగ్యసీమరా! పాడి పంటలకు కొరత లేదురా' అంటూ, ఇంకా పల్లె ప్రకృతిని, పల్లె వాసులు కల్లా కపటం లేని అమాయక ప్రేమ జీవులని, అదని, ఇదని ఎంతో వర్ణిస్తారు కవులు. పూర్వమేమో గాని నేడు మాత్రం 'పల్లెటూరి రామణీయకత' కేవలం కవి సమయం గానే మారింది.

ఎంతో కుతూహలంతో, ఆనందంతో వైష్ణవసామల్ అనే లెక్చరర్ గారు పోలింగ్ ఆఫీసర్ గా ఓ మారు మూల పల్లెకు పోతాడు. అడుగడుగునా పాప మతనికి అడ్డంకులే ఎదురైనాయి. పశువుల కొట్టంలాంటి గదిలో వాసం. లోపల ఎలా ఉందో చూద్దామని లోపలికి పోబోతుంటే సామల్ తలమీద వెదురు దెబ్బ పొడుచుకొన్నది. ఆరాత్రి మట్టి నేలపై బెడ్డింగ్ పరుచుకొని పడుకున్నాడు. ఇంటికున్న కప్పులనుండి ఓ పాము అకస్మాత్తుగ సామల్ మీదపడి పారిపోవడంతో సంగం ప్రాణాలు పోయాయి. ఇక పోలింగ్ లో దొంగ ఓట్ల తతంగం సరేసరి.

ఎంతో ఉత్సాహంతో వెళ్ళిన సామల్ కు పల్లెమీద నుండే సదభిప్రాయం చెదరి పోయింది. కవితలలో తప్పని స్మలత్వం మానవుల్లో కనబడితే దానికి. నేటి గ్రామాలసగటు పరిస్థితి ఇన్నదున్నట్లు చిత్రీకరించారు రచయిత.

అఖిలమోహన్ పట్నాయక్ గారి 'దాగుడుమూతలు' చిత్రల బొత్తై 80 సంచికలో ప్రచురించారు. ఎవరు ఎప్పుడు మృత్యుదేవతకు అతిథిగా మారుతారో తెలియని పరిస్థితి ఇందు చిత్రితము.

ఇంకా కామేశ్వరిగారు పెక్కు కథలు తెలుగువారి కందించారు. వాటి నన్నింటిని స్థలాభావం చేత పేర్కొనజాలను.

'ఉత్కళీయాంధ్ర కవుల చరిత్ర' ను శ్రీ డబీక్ నారాయణమూర్తి శర్మగారు 1929 లోనే ప్రకటించారు. అంతకు ముందే ఆ గ్రంథం శిష్టకరణ పత్రిక అనుబంధం గా వెలువడింది. శిష్ట కరణ కవులు ఆంధ్ర ఒరియా సాహిత్యాలకు సేతు నిర్మాణం గావించినవారు. వీరు ఒరియా శిష్ట సాహిత్యమును ఒరియావారికి అందించడంలో ప్రశంసనీయమైన కృషి సల్పారు.

అశ్వినీ కుమార్ ఘోష్ గారి 'కలాపహాడ్' నాటకమును ఒక విద్యార్థి సాయంతో ఒరియానుండి 1928 లోనే శ్రీ పాద కామేశ్వరరావుగా రనువదించారు.

ఆంధ్రుడైన శ్రీ పోతాప్రగడ వెంకటరత్నంగారు తల్లావజ్ఝల గేయనాటికలనూ, నందూరి ఎంకిపాటలను, ఇంకా ఏవో గేయాలను ఒరియావారి కందించారు.

నంగిని శత్పథిగారి 'నీలాకాశ' మను కథను 28-6 1978 జాగృతి వార పత్రికలో సూరజ్ (పురాణపండ రంగనాథ) గారను వదించారు.

ప్రతిరోజు వినీలాకాశంలో దూసుకు పోయే ఓ పైలట్ హృదయంలోని మధనాన్ని, అంతః సంఘర్షణను కళ్ళకు సాక్షాత్కరింప జేస్తుంది రచయిత్రి.

పైలట్ సుబ్రతతల్లి విమాన ప్రమాదంలో మరణించినది. ఆమె శవం కూడ దొరకలేదు. ఆమె మరణ మతని పై గాఢ

మైన ముద్ర వేసింది. పైలట్ గా పర్వత సంక్తుల మీదుగ ప్రయాణించినపుడు ఆమె పేనాలాపాలు వినబడేవి. దీనితో అతనికి అసంతృప్తిఅసమర్థభావనఅవతరించాయి.

వృత్తిరీత్యా ధైర్యవంతుడైన పైలట్ కాని చిత్తవృత్తిలో నతడు నిస్సహాయుడైన తల్లిలేని పిల్లవాడు. అతనిలో చెలరేగిన భావాలకు అద్దం పట్టింది కథ.

వజ్ఝల వేంకటేశ్వర్లు ఉద్యోగరీత్యా ఒరిస్సాలో నివసించి ఆభాష నేర్చుకొని స్వీయకావ్యమైన 'నాకాభంగము' ను ఒరియాలోని కనువదించెను. ఇది మాయాధర మానసింహ వంటి ప్రసిద్ధ ఒరియా రచయితల ప్రశంసల నందుకొన్నది.

చాగంటి తులసి గారు ఒరిస్సాలో హిందీ అధ్యాపికగా పనిచేయుచు, సచ్చిదానందరౌత్ రాయ్ మున్నగు ఒరియా రచయితల కథలను తెనిగించారు.

ఇటీవల బరంపురం వికాసమితి వారు ఒరియా రచనల నాంధ్రీకరించుచున్నారు.

'కేవీ' అను పొడి అక్షరాలతో ఎవరో పెక్కు ఒరియా కథల ననువదించారు. కాళీచరణ్ దాసు రచించిన కథ 'సాక్షాత్కారం' విపుల డిసెంబర్ 1979 సంచికలో ప్రచురితమైనది.

ప్రభుత్వం స్వాతంత్ర్య సమరయోధుల శిలారూపాల లిచ్చి బజార్లలో నిలబెట్టే తంతుపైసాగిన విమర్శనాత్మక కథ ఇది. ఎందరో మహానుభావులు. అందరికీ విగ్రహాలు కావాలి. మరి విగ్రహాలు నిర్మించిన పిదప వాటిని పవిత్రంగా నుంచాల్సిన కనీస బాధ్యత ప్రభుత్వం పైనే ఉంటుంది. ఒరిస్సా రాజధానిలోని విగ్రహాల గోడు మీరు కూడ వినండి.

'ఉత్కళ గౌరవం' మధుసూదన్ దాస్ 'నాతల ఎలా ఎండలో మాడు తుందో, కాళ్లు అలా భూమిలో పుడికి పోతున్నాయి. ఈకష్టాలకు తోడుగా పిల్ల వెధవలు ఎంగిలాకులు నామీదికే విసిరేస్తారు. ఇక్క డేదైనా బహిరంగ సభ జరిగితే నేను జనంలో క్రిక్కిరిసి ఉండడమేగాక జనం నాపై కెక్కి కూర్చుంటారు.' అని తన గోడు వెళ్ళబోసు కుంటాడు.

పెద్ద మర్రిచెట్టు క్రిందున్న 'ఉత్కళ మణి' గోపబంధు దాసు 'ఈచెట్టు మీదున్న పక్షులు మలవిసర్జన చేస్తే అదంతా నాపైని పడుతుం' దని బాధపడ్డాడు.

నిజమే, ఎందరో మహానుభావుల విగ్రహాలు రంగులు వెలసి వాల్ పోస్టర్లు అతికించబడి కనిపించుటకు కారణం ప్రభుత్వం యొక్క అశ్రద్ధయే.అనువాదం సులభ శైలిలో సూటిగా సాగింది.

శైలేంద్ర మహాపాత్రో గారి 'విషాద వార్త' ను కేవీ విపుల ఏప్రిల్ 80 సంచికలో ప్రచురించారు.

ఓ పత్రికా సంపాదకుడు శీర్షికను నిర్ణయించే ముందు ఏవిధంగా అవస్థపడతాడో ఒక చిన్న పొరపాటువలన ఎన్ని లక్షలకాపీలు పాడయిపోతవో ఈ కథ సరసంగా వర్ణిస్తుంది.

'ఉత్కళ కిరీటం' డా॥ హటనాగర్ లండన్‌లో మృత్యువుతో పోరాడుతుంటాడు. 'జనవాహిని' ఎడిటర్ అతడు చావకముందే శీర్షికా నిర్ణయంకోసం తల బ్రద్దలు కొట్టుకుంటుంటాడు. హటనాగర్ మరణ మని ఫోన్ రాగానే కొన్నిలక్షల కాపీలు ప్రచురిస్తారు. కొన్ని కాపీలు బైటికి పోగానే 'బ్రతికేఉన్నా' కన్పిస్తుందని మరల ఫోన్ వస్తుంది. ఇక సంపాదకుని స్థితి చూడవలసినదే కాని చెప్పవలసినది కాదు.

ఈకథకు మూలం జయప్రకాశ్ మరణ మనితోస్తుంది. మొత్తం పైని పత్రికా నిర్వహణలోని సాధక బాధకాలను వివరిస్తుం దీకథ.

పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, తాపీ ధర్మారావు, దేవరాజు వేంకట కృష్ణారావు, న్యాయపతి రామనుజస్వామి గార్లు ఒరిస్సాలో స్థిరపడిన ఆంధ్రులు, ఎన్నో తెలుగు చిత్రాలు ఒరియాలోకి 'డబ్' చేయబడ్డాయి. శ్రీమతి P. సుశీల 'మమత' అనే ఒరియాచిత్రంలో పాటలు పాడారు.

ఈ విధంగా ఆంధ్రులు యథోచిత విధంగా సోదర భాష అయిన ఒరియాకు సేవచేశారు.

ముఖ్య ఆధారాలు :-

1. 'సృజన' త్రైమాసిక. Nov. 68-Jan. 69.
2. 'తెలుగువాణి' ప్రపంచ తెలుగుమహాసభల ప్రచురణ.
3. ఆంధ్ర సారస్వత పరిషత్ రజతోత్సవ సంచిక.
4 ఆంధ్ర నవలా సాహిత్య వికాసం- పుల్లాభొట్ల వేంకటేశ్వర్లు.

మరికొన్ని.

—...—

# తుమ్మలవారి 'రాష్ట్ర గాన' రామణీయకత

— శ్రీ కవేరపు వెంకట్రామయ్య, ఎం. ఏ.

'ఆంధ్రుడవై జన్మించితి
వాంధ్రుడవై యనుభవింపు
మాయు ర్విభవం
బాంధ్రుడవై మరణింపుము;
ఆంధ్రత్వములేని బ్రదుకు నాసింపకుమా.'

— తుమ్మల.

ఇరవైయవ శతాబ్ది ప్రథమపాదంలో జాతీయోద్యమంతోపాటు ప్రవర్తిల్లిన మరో ఉద్యమం ప్రత్యేక ఆంధ్రరాష్ట్రోద్యమం. కవి సమాజంలో ఒకడు. సమాజ సమస్యలు అతని సమస్యలు. అందుకే సమాజంలోని ప్రతి సంచలనానికి కవి స్పందిస్తాడనడం పరిపాటి. ఏ ఉద్యమం సంఘాన్ని చలితం చేసినా, దాని ప్రభావం వల్ల కవిత్వం—విస్తారంగా వెలువడుతుంది. ఆ కవిత్వం మరల ఉద్యమాన్ని ముందుకు నడిపించడం మనకు అనుభవైకవేద్యమయిన విషయమే. 'ఉద్యమాలు కవితకు ఊపిరు లూదితే, కవితలు ఉద్యమానికి కాహళలు సంధిస్తాయి.' ఈవిధంగా ఉద్యమాలు, కవిత్వం విడదీయరాని సంబంధం కలిగి పరస్పర పోషకాలవుతున్నవి. దానికి ప్రత్యక్ష నిదర్శనం ప్రత్యేక ఆంధ్రరాష్ట్రోద్యమం.

మహోత్తుంగ తరంగంలా పైకెగసి పరవళ్ళు త్రొక్కిన ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రోద్యమంతో—ఆంధ్రసాహిత్యంలో ఆంధ్రోద్యమ కవిత పేర ఒక ప్రత్యేక శాఖగా పరిగణింపదగినంత సాహిత్యం వెలువడింది. పూర్వాంధ్రుల మహోజ్వల చరిత్రను—ప్రాచీన వైభవవిశేషాలను—వారి శౌర్యధైర్యాలను—సాధించిన విజయాలను ప్రస్తుతిస్తూ ఆంధ్రులలో ప్రబలిన నిరాశా రేఖలను తొలగించడానికి ఆ తరం కవులెల్లరు అహమహమికతో కవిత లల్లారు. రాయప్రోలు, జాషువా, విశ్వనాథ, కోడాలి, తుమ్మల, పుట్టపర్తి వంటి కవులెందరో జాతికిపట్టిన మత్తువదలించి, రాష్ట్రోద్యమ భావ విస్ఫులింగాలను ఒక్కుమ్మడిగా ప్రజ్వలింపచేశారు. అట్టి కృతుల రాశిలో వాసికెక్కిన తుమ్మలవారి 'రాష్ట్రగాన' కావ్య రామణీయకతను ప్రత్యక్షీకరించడమే ప్రస్తుత వ్యాసోద్దేశం.

ఆంధ్రోద్యమం విస్తృత చరిత్ర కలది. సాధారణంగా భారత దేశంలో ఏ ఉద్యమం లేచినా మొదట వంగభూమిని ఆకట్టుకుంటుంది. ఆపై ఆంధ్రను స్పందింపచేస్తుంది. వంగదేశం, బీహార్‌లలో ప్రారంభమైన భాషాసంబంధ ఉద్యమాలు ఆంధ్రోద్యమానికి బీజప్రాయములు. ముట్నూరి వారి 'కృష్ణాపత్రిక'; కాశీనాథుని నాగేశ్వరరావు గారి ఆంధ్రపత్రిక ఆంధ్రోద్యమానికి స్ఫూర్తి నిచ్చినవి. 1907 లో విజ్ఞాన చంద్రికామండలి స్థాపనము; 1919 లో గుంటూరులో ఆంధ్రయువజన సాహిత్య సంఘ సమావేశమున జరిగిన ఆంధ్రరాష్ట్రమునకు సంబంధించిన తీర్మానము, 1913లో బాపట్లలో జరిగిన ప్రథమాంధ్ర మహాసభ; ఉద్యమానికి స్పష్టమైన ఆకృతి నిచ్చినవి. ప్రజల పోరాటం ప్రారంభమైనది. 1917 లో భారతజాతీయ కాంగ్రెస్ ఆంధ్రుల కోర్కెను అంగీకరించింది. స్వాతంత్ర్యసమరంలోని ఒడుదొడుకులు ఈ ఉద్యమంపై పరోక్షంగా పనిచేసినవి. ఆంధ్రులకోర్కెకు అనుగుణంగా 1926లో ఆంధ్రవిశ్వవిద్యాలయ స్థాపన జరిగినది. ఉద్యమం సాగుతూనే ఉంది. 1936 లో జాతీయకాంగ్రెస్ స్వరాజ్యం సిద్ధించిన పిమ్మటనే భాషాప్రయుక్త రాష్ట్రవిభజన సమస్య చేపట్టాలని నిర్ణయించింది. 1947లో స్వాతంత్ర్యం సిద్ధించిన పిమ్మట ఆంధ్రరాష్ట్రవిభజన జరగాలని నాయకులు పట్టుపట్టారు. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ వల్లభాయి పటేలు, డా. భోగరాజు పట్టాభి సీతారామయ్యలతో ఒక ఉపసంఘాన్ని ఎ.ఐ.సి.సి నియమించింది. 'J V P. Raport' గా ప్రసిద్ధికెక్కిన ఈ నివేదికలో ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణానికి సిఫారసు చేయబడింది. ఈలోగా జస్టిస్ ధార్ అధ్యక్షతను మరోసంఘం నియమింపబడింది. ఈ సంఘం భాషాప్రయుక్తరాష్ట్రోద్యమ ప్రత్యేకతను గుర్తించదానికి సుముఖత వ్యక్తంచేసింది. అయినా ఫలితంలేదు. తుదకు 'ఖచ్చితమైన' సూచనలు చేయుటకు 1949 లో కేంద్రం మరోసంఘాన్ని నియమించింది. 1950 లో ఈ సంఘం తన నివేదిక సమర్పించింది. 1950 జనవరి 26 నాటికి ప్రత్యేకాంధ్రరాష్ట్రం రూపు దాల్చుతుందని ఆంధ్రప్రజానీకం భావించినది.

కాని అప్పటి కీసమస్యను వాయిదా వేసినట్లు ప్రకటించగానే మరలా ఉద్యమం తీవ్రతరం అయింది. శ్రీ పొట్టి శ్రీరాములు ఆమరణ నిరాహారదీక్ష బూని ఆత్మాహుతి చేసికొన్నారు. కేంద్రం కన్నుతెరచి జస్టిస్ వాంఛూని ఈసమస్యపై సమగ్ర నివేదిక సమర్పించటానికి నియమించింది. ఏతత్ఫలితంగా 1953 అక్టోబరు 1 వ తేదీని కర్నూలు రాజధానిగా, 'ఆంధ్రకేసరి' టంగుటూరి ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రిగా ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఆవిర్భవించింది. భాషా ప్రాతిపదికపై రాష్ట్రాలను పునర్విభజించాలని ప్రభుత్వం ఫజుల్ ఆలీ ఆధ్వర్యంలో ఒక సంఘాన్ని నియమించింది. ఈ సంఘం 1955లో తన నివేదిక సమర్పించింది. ఏతత్ఫలితంగా 1956 వంబరు ఒకటిన — నిజాం పరిపాలన అంతమై తెలంగాణాకూడా చేరటంతో—హైదరా

కాదు రాజధానిగా 'ఆంధ్రప్రదేశ్' రాష్ట్రము ఆవిర్భవించింది.

దాదాపు ఐదు దశాబ్దాలు సాగిన ఈ ఉద్యమంలో ప్రత్యక్షసంబంధం కలిగిన శ్రీతుమ్మల స్వస్థానవేష భాషాభిమాని. ఆంధ్రుల ఔన్నత్యం కోసం ఎంతో ఆరాటపడి, తన ఆవేదనను కావ్యరూపాన వెలువరించారు. 'తెలుగు దేశము, తెలుగు భాష, తెలుగు చరిత్ర, తెలుగుప్రజ, తెలుగు సంస్కృతి, అనినంతనే నారొమ్ముడలు పులకరించును. ఇవి నాకు ప్రాణకల్ప విషయములు. నేను తెలుగువాడను - అను నహంకారము నాకెక్కువ. ఈ యహంకారమే నన్ను కవిని చేసినది. ఇట్టి నాజాతియు, నా భాషయు, పరతంత్రములై పరకీయ సంస్కారము నాశ్రయించి ప్రాచీన గౌరవము గోల్పోయినవి గదా! ఇది నా మనస్సులో అనుక్షణము రేగునట్టి యారాటము. ఈ యారాటమునకు సాక్షి పుడు కదలినాడు. ఆ కదలిక యే రాష్ట్రగానము.'

'1937 అక్టోబరు మాసమున విజయవాటికయం దంఖండ వైభవముతో నడచిన యాంధ్ర మహాసభలో పెద్దలు వారు రాష్ట్ర సంపాదనము పట్ల వెలువరించిన యావేశము, ప్రచరించిన యుత్సాహము, ప్రకటించిన యుద్రేకము నాయీ కవిత యవతరించుటకు కారణములు' - అని కవి కంఠోక్తి. నడకలో, నాటకములో, కట్టులో, బొట్టులో నూటికి నూరుపాళ్ళు ఆంధ్రత్వమును మూర్తీభవించు కొన్న తుమ్మల ఆంధ్రత్వమును నిండుదనముతో చాటుటకే యీకృతి రచించిరి.

'పరవేష భాషా సపర్య తారకమాట
నాంధ్రత్వమే సగం బడిగిపోయె
పరఖడ్గమునకు లోబడి జోహారులు వెట్ట
స్వాతంత్ర్య భావముల్ జారిపోయె
పరతత్త్వములు చుట్టుకొని
యార్యత్వమును దింప
సైకమత్యము సర్వమారిపోయె
అసతుర్క తోపంకమంతు బ్రుంగుటజేసి
మెట్ట వేదాంతముల్ మిట్టిపోయె
నలిగి పోయిన యానాటి తెలుగు బిడ్డ
కేమి సందేశమిత్తు తల్లి! తమస్సు
విడుచు చున్నది యిప్పుడిప్పుడె రవంత
ఉద్ధరింపుము దీని సద్బుద్ధు లూని'

అని 'హైవారము' అనే ఖండికలో తుమ్మల వారు నలిగిపోయిన యానాటి ఆంధ్రుని గాంచి తల్లడిల్లారు. విదేశీ నాగరికతా వ్యామోహంలో ఆత్మీయ సంస్కృతి ధర్మదీధితులకు చ్యుతి యేర్పడుటను గమనించిన ఆయన - బాధాతప్త హృదయులై - పూర్వాంధ్రుల యశఃప్రాభవాలను స్మరణకు దెచ్చి కాలానికి ఎదురొడ్డి నిలువుడని హెచ్చరిస్తున్నారు.

'కలదోయి! తెలుగుకోడులతుటారి కటారి
చెలరేగి పగఱ జీల్చిన దినంబు
కలదోయి! తెలుగురాజులుగంగగట్టుపై
దిండ్రడించి పగడ జెత్తిన దినంబు
కలదోయి! రేవురేవుల దెలుంగు సరంగు
మొనసి లంగర్లు దింపిన దినంబు
కలదోయి! తెలుగుకుబ్కల వెలందివెలంది
వెలుగు తెల్లెడల బర్విన దినంబు
కలదు కలదోయి! తెల్గుపెగ్గడలు మున్ను
మిన్ను తాళంబువైచి పేర్గన్న దినము
నేటి నీపాటు నెంచి కన్నీటి నిడక
నిలుచునే కాల మొక లీల దెలుగుబిడ్డ!'

అంతేకాదు! తెలుగుజాతుల దాన జలవేణిలో గిరుల్ తెప్పలై పర్వులెత్తినదినాలు, తెలుగుటోజ్జల పాదాల చెంత జగమెల్ల విజ్ఞాన మధువు ద్రావిన దినాలు, తెలుగు బిడ్డలు వలాలకు తిలాంజలులిచ్చి ఒకచాప యన్నము దిన్న దినాలు అని ఆచార్యనాగార్జునుడు; బ్రహ్మనాయుడు మొదలగు మహోదాత్త చరితులను ఆంధ్రులను తలచి ఒకప్రక్క ఒడలుప్పొంగ వేరొక వైపు నేటి హైన్యమును, దైన్యమును, గాంచి వ్యథ చెందుట కవిలో కన్పట్టును. ఈపట్టుననే అయినా 'దేశభక్తి పదవీనదవీయని హైన దీక్ష' సడలనీక మాతృ గౌరవము నినుమడింపచేయుమంటున్నారు. ఆమాతృమూర్తి పూత చరిత. చూడుడు కవిగారి భావన.

'నన్నపాచార్య తిక్కన్నాది కవికోటి
రచే తల్లి కవుదుపై నెక్కినాడె
కృష్ణరాయాదిక క్షితిపాలు రే తల్లి
నోల పాటలలో సుఖ స్థిగని రి
రావెళ్ళ మల్లన ప్రముఖవీరవక్షణ్యు
లొత్తిల్లి రేతల్లి యుదరసీమ
త్యాగరాజాది భక్త సమాజమే తల్లి
యందిచ్చు వెన్నల నారగించె
గౌతమీపత్య కృష్ణవేణీ తరంగ
పాళి యే తల్లి తూగు టుయ్యాల లయ్యె
దీక్షపై గొల్తు నయ్యాంధ్రదేశ మాతృ
విమల చరణద్వయంబు హృద్వీథి నిల్పి.'

ఆమెకు గిరిలోక రాజము, అంబర చుంబి శిఖరము వింధ్యము ఛత్రమట. గౌతమీ కృష్ణవేణీ తుంగభద్రలు ముత్యాల సరములై మురువు చూపు చున్నవట. ఆమె వైభవాన్ని కవి కుమారులు హృద్య గద్య పద్యముల వర్ణిస్తున్నారట. చెన్నపుర హేమపీఠికాసీన యగు ఆ తెలుగు తల్లిని ఇంతగా మనోజ్ఞంగా వర్ణించిన కవి తుమ్మల.

అట్టి ఆంధ్రదేశ పురాప్రాభవములు తనివి దీరా వర్ణించాడు కవి. రాయప్రోలు వారి ప్రభావము ఇప్పట్టున కన్పట్టినను; తుమ్మల వారిలోగల 'మౌలికత' ప్రశంసనీయము. ఆంధ్రుల చరిత్రలోని మారుమూలలోని సువర్ణఘట్టాలను సహితం గాలించి వెలికి తెచ్చి హృదయానికి హత్తుకొనేటట్లు, మహావేశంతో క్రమకవితాగానం చేశారు తుమ్మల. 'ప్రశస్తి' అను పేర రచించిన వంద్రెండు పద్యాలు ప్రాచీనాంధ్రాభ్యుదయాని కెత్తిన దివ్య నీరాజనాలు. ఒక్కొక్క పద్యం ఆణిముత్యం.

'ఆంధ్రరాజ్య స్థాపనాచార్యుడై తెల్గు
వేలుపైనాడాంధ్ర విష్ణు విభుడు

రణకళానిధి సుశర్మను జంపి మగధోర్వి
  శాసించె శ్రీముఖ చక్రవర్తి.
పౌత్త్రగాహుల నెల్ల నదలించె హాలుండు
  శాలివాహన శక స్థాపకుండు
నిజజయస్తంభముల్ నిఖిలదిక్కులఁ బాఁతె
  గౌతమీ పుత్రుండు శాతకర్ణి
శాత్రవుల గెల్చి మాళవధాత్రికెల్ల
నాథుఁ డయ్యెను వాసిష్ఠినందనుండు
ప్రాంత వడినట్టియాంధ్రభూపతులకథలు
చదువుఁ డొకసారి కండలు కదలియాడ'

ఇంకా ఆపస్తంబఋషి నాగార్జునుడు, యోగివేమన, కంచెర్ల గోపన్న లాంటి అతిలోక మతులైన తెలుగు సుతుల తలపు మంటున్నారు. తన విద్యచేత లోకానికి ఒజ్జయైన అన్నంభట్టు, తనదాన ధారచేత ఎల్లరకు బంధువైన భాస్కరమంత్రి, తన ప్రజ్ఞచే మన్ను మిన్ను గుప్పిటఁ బట్టిన తిమ్మరుసు; తన గీతిచే జగానికి జీవం పోసిన నాదబ్రహ్మ త్యాగయ్య, నా వారని 'విశ్వరంగమ్ముపై ఔొమ్ము విఱిచి నిలిచి, లీలమైఁ బల్కు హక్కు నాకే లభించి' నదని సగర్వంగా చెప్పు కుంటున్నారు. బంగారు ముద్దలు అర్థుల కిచ్చిన రాజా వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు, కావ్యకళావిదుడు నన్నెచోడుడు నిఖిలప్రజకు ఔపనిషద పీయూషంబు నరయు వీరబ్రహ్మ గురువరుండు, అభినవ భోజుఁడన్నఖ్యాతి పొందిన ఆనందగజపతి భగవదవతారుడైన సూరి రామానుజాచార్యుడు తన వారన్న 'జాతీయగరిమతో' పొంగి

'లాలిత్య లక్ష్మీ విలాసరంగమ్ము ని
  ల్పితి వజంతా చిత్ర లేఖనమ్ము
సవరించితివి శైవభువనమ్ము 'నెల్లోరా'
  కొండను మైనంపుటుండఁ జేసి
విఠ్ఠల ప్రభుని కోవెల కంబముల చేతఁ
  బలికింపగంటి సప్తస్వరాలు
బలికించి తౌర! తిమ్మల నాథునగరులో
  వెలలేని సభ్యతా విలసనములు
భగవదన్వేషణార్థమై పాటుపడిన
యుత్తమ తపస్వివై కళాయోగివైన
నీకు ఋణపడె రసలుబ్ధ లోకమెల్ల
నాంధ్రశిల్పీ! చిరంజీవి వయ్య నీవు!

ఆంధ్రుల కళా ప్రశస్తి కెత్తిన దివ్వె ఈ పద్యము. పురుషులే కాదు స్త్రీలును మిన్నలే నట: కలము, ఖడ్గము రెండింట జాణ రెడ్డి నాగమ్మ, జగముగంటిమి ఆంధ్ర జగతి పాలించిన రుద్రమదేవి, గండి కోటను మల్కాదండుపై దూఁకిన పెమ్మసాని తిమ్మానాయని చెల్లెలు గోవింద మాంబ, మానంబునకై ప్రాణాలర్పించిన మల్లాంబ, వీరచానమ్మలను గన్న పూత చరిత్ర ఆంధ్రమాత యని ప్రజల్లో నూత్నోత్సాహన్ని కలిగించి కర్తవ్యోన్ముఖుల్ని చేసిన కార్య వాది తుమ్మల.

(సశేషం)

# ❋ సులోచన ❋

- డా. పూసపాటి భాగ్యలక్ష్మి, ఎం.ఏ., పిహెచ్.డి.

ఆదినుండి నేటివఱకును తెలుగు సాహిత్యమున అసంఖ్యాకములగు స్త్రీ పాత్రలు చిత్రింపబడినవి. వానిలో కొన్ని సంస్కృతవాఙ్మయమున జన్మించి, తెలుగున యథాతథముగ చిత్రింపబడినట్టివి. మఱికొన్ని సంస్కృతమునందే జన్మించినను సర్వస్వతంత్రులగు కవుల చిత్రణననుసరించి తెలుగు, సాహిత్యమున ఆకృతిని, ప్రాణప్రతిష్ఠను పొందినట్టివి. ఇట్టి కోవకు చెందినదే 'సులోచన'.

తెలుగునాట ఆబాలగోపాలము చిరపరిచితమైనది రామకథ. ఈరామకథకు సంబంధించిన వాఙ్మయ మెంతో ప్రచారము నందినది. కవులు భక్తిభావముతో రాముని మహిమలపై తమ చూపును ప్రసరింపచేసిరి. కాని రాముని మహిమతో సంబంధము కలిగిన పతివ్రతాశిరోమణి యగు సులోచన కథపై తమసృష్టిని ఏలనో సారింపలేదు. అందువలననే ఈమె తెలుగు ప్రజలకు కొంత అపరిచితగ నిలిచిపోయినది.

సులోచన ఆంధ్రసారస్వత కళాసౌధమును శోభామయ మొనరించిన మాణిక్య దీప మని చెప్పవచ్చును. ఈమె భోగీశుని గారాబు పుత్త్రి అరిలోకభయంకరుడగు రావణబ్రహ్మకును, పతివ్రతా శిరోమణియగు మండోదరికిని కూరిమికోడలు. ఇంద్రారియగు మేఘనాథుని యిల్లాలు. సకల సద్గుణసంపన్న. అతిలోక సుందరి. ఈమె గాంభీర్యము, మనోధైర్యము అనితర స్త్రీసాధ్యములు. విగతజీవుడైన పతి కళేబరమును చూచి వివ్యాఘత నొందక, ధీరత్వముతో రణరంగమున శత్రుసమూహమున ప్రవేశించి, రాముని స్తుతించి మెప్పించి, ఆతని పరీక్షకు నిలిచిన పతివ్రతా శిరోమణి. పతిశిరమును తెచ్చి రావణుని వంటి వానిని ఆశ్చర్యచకితుని చేసినది. శ్రీరామచంద్రుని పరమాత్మస్వరూపముగ నెఱిగి, మామగారగు దశకంఠునకు కాల విపర్యయమును తెలియచేసి, నీతిబోధచేసి, కర్తవ్యము నెఱుకపఱచుటకు ప్రయత్నించిన ఆ యింటి పెద్దకోడలు. ఆదిశేషుని అవతారమగు లక్ష్మణునకు సైతము, అవతార తత్త్వము నెఱింగించి, కర్తవ్యోపదేశము గావించిన జ్ఞాని, సమస్తదేవతా బృందము వినువీథిని నిలిచి ప్రశంసాపుష్పములు వర్షింప, రామాది ప్రభృతులదీవన లంది, అత్తమామల అనుజ్ఞచే సహగమనము గావించి, దేవలోకమును చేరిన పతివ్రతా తిలకము ఈమె.

ఇట్టి విశిష్టమూర్తి యగు సులోచన వృత్తాంతము వాల్మీకిరామాయణమునందు లేదు. వాల్మీకి కృతముగ పేర్కొనబడిన ఆనంద రామాయణమున కొలదిగ కలదు. రణరంగమున పడిపోయిన ఇంద్రజిత్తుని

ఇంద్రజిత్తుని యొక్క హస్తము సులోచన అంతఃపురమునందు పడి, ఆమెను యుద్ధరంగమునకు రమ్మని కొన్ని అక్షరములు లిఖించినది. వానిని చూచి సులోచన దుఃఖించుచు, అత్తమామల అనుమతితో శ్రీరాముని చేరి స్తుతించినది. ఆతడు ఆమె భక్తి భావమునకు సంతసించి ఇంద్రజిత్తుని పునరుజ్జీవుని చేసెదనని పలుకగా 'వానికి గలిగిన ముక్తి జీవనముకంటె మేలు' అని ఆతనిని బ్రతికింపకుండ నిరోధించినది. భర్తృశిరమును చేరినది. ... ఇట్లు ఆనందరామాయణమున సులోచన పాత్ర చిత్రణ మతి సంక్షిప్తము.

ఆనందరామాయణమున గల రేఖామాత్రమగు సులోచన పాత్రనుగ్రహించి, ఆ పాత్రకొక విధమయిన నూతన వ్యక్తిత్వవికాసములను కలిగించి, చైతన్యవంతము చకచ్చకితము గావించి, ఆమెను సీతమ్మతో సమాన స్థాయి యందు కూర్చుండ బెట్టిన కావ్యము రంగనాథ రామాయణము. కాని ఈ కావ్యమునందును సులోచనా వృత్తాంతము అనుబంధముగ మిగిలిపోయినది. ఈ కావ్యమునందు ప్రతిపదమునందు ఆమె సద్గుణ సౌరభము, సంభాషణ చాతుర్యము, పాతివ్రత్య ప్రభావమును వ్యక్తములగుచున్నవి.

ఈ కావ్యమునందు సులోచన పతియే సర్వస్వమను భావన గల సాధ్వి. ఇంద్రజిత్తు యుద్ధభూమి కరిగి మూడుదినములైనది. అచటి నుండి ఆతని క్షేమసమాచారములు తెలియలేదు. అందువలన, అంతఃపురమున సఖులందరును ఆటపాటలతో, సరససల్లాపాది సద్గోష్ఠీకథలతో పరిహాసచాతుర్యపరిభాషలతోను ఆమెను మెప్పించు ప్రయత్నము చేయుచున్నను, ఒకానొక అవ్యక్తవేదనకు ఆమె మానసము గురియైనది. మున్ముందు రాగల భవిష్యత్తునకు, విపత్తునకు ఆమె అంతరంగము ఆందోళన చెందుచున్నస్థితి యిట వ్యక్తమగుచున్నది. ఇట్టి సమయమున, రణరంగమున లక్ష్మణునిచే కూలిపోయిన ఇంద్రజిత్తు హస్తము సులోచనా మందిరమున బడినది. ఆతడు ఏకమాత్ర ప్రాణావశిష్టుడై రణస్థలియందు సులోచనకొఱకు ఎదురుచూచుచున్నట్లును ఆమె నచటికి రమ్మనియు తెలుపుచు ఆహస్తము కొన్ని అక్షరములను లిఖించినది

ఈ విషయమును చూచి భయభ్రాంతలైన చెలికత్తెలు సులోచనకు తెలిపినారు. ఈ విషయమును వినినంతనే ఆమెమనసు తల్లడమందినది. కైలాసపతి ఏమి కల్పించెనో అనుచు ఆవింతను వీక్షించుటకు బయలుదేరినది. - ఇట్లు సులోచనను మొట్టమొదటగ ఈ కావ్యమున,భర్త రణభూమికేగగా ప్రతినిమిషమును ఆతని క్షేమమునకై తహతహలాడుచు, భవిష్యత్తు నూహించుచు, అవ్యక్తాందోళనలకు గురియైన సతీమణిగ కవి ప్రవేశపెట్టినాడు. ఇంద్రజిత్తుహస్తలిఖితాక్షరములను చూచి, శోకమగ్నయై, భర్తరూపము ఆత్మలో నిలిపి, శోకించినతీరు, శోకమూర్తియగు ఆమెను పతితల కన్నుల ముందర నిలుపుచున్నది.

పతి శిరమును తెచ్చుటకై రణభూమికేగ యత్నించిన సులోచన, రావణుని అనుమతిని పొందు విధము ఆమె పాతివ్రత్యమునకు, వినయవివేకాదిసౌజన్యములకు, సంభాషణచాతుర్యమునకు నిదర్శనము. 'అక్షీణవిక్రముడగు నీ సుతుడు, నీ కోర్కెలను పూర్తిచేయుటకై రణరంగమున కరిగి హతుడయ్యె' నని పలికినది.- పతిమరణమునకు శోకముచే క్రుంగిపోవు సులోచన హృదయ మిట వ్యక్తమగుచున్నది. బలయుతుడగు సౌమిత్రి ఆహవరంగమున విడువక, ఇంద్రజిత్తు శిరమును రాముని సన్నిధికి కొనిపోయిన వైనము రావణునకు వివరించి.

'భర్తృశిరోహీనభామ కేలాగు
కర్తృత్వమమరునాగమసిద్ధ కధిప
యావిరోధులయొద్ద నతి దీనవృత్తి
జీవితేశుం డింద్రజిత్తు మస్తకము
నున్నది యదిరాక యుచితకృత్యముల
నున్నమనోరథం బొందవునె నాకు
వాసవానోకహావరపుష్పనిచయ
వాసనావాసితోజ్జ్వలమైన యట్టి
నానాథుతల దెచ్చి నాకిచ్చి వేగ
నానాథుఁగూడంగ నన్నంపవయ్య.'

అని ప్రార్థించినది. ఇట ఇంద్రజిత్తు శిరమునకు ఆమె ఉపయోగించిన విశేషణములు ఆమె స్మృతిపథమున నిలిచిన ఆతని వైభవమునకు సూచకములు.

'వనజాక్షి సీతల వైధవ్యమమర పని పూని వ్రాసిన పద్మసంభవుని దండింతు' నని రావణుడు రోషావేశములతో బయలుదేరినాడు. ప్రస్తుతము తమ కుటుంబమునకు దైవబలము తగ్గినదని సులోచన గుర్తించినది. కనుక మామగారిని నిలిపి, ఈ విధముగ పలికినది.

'కాలవిపర్యాసగతి గాదె యింత
యేలపుట్టును చూడు మెన్నిభంగులను
కాలచక్రం బది కడు విచిత్రంబు
కాల మెవ్వరికైన గడువంగ వశమె
అది గాక యిది సేయుమందాక నేను
నోదుగుచు నెటులుందు నొక్క ప్రాణస్థు!
డైక కళేబరము నాహవభూమి నిలిపి
నా కెదురుచూచుచు నా ప్రాణ
వల్లభుండు ...

కాలతత్త్వము నెఱిగి, పతిమరణము విధిలిఖితముగ, సహజముగ తలచి నిలిచిన సులోచన ధీరత్వ మిట వెల్లడియగుచున్నది. ఇంద్రజిత్తు పంచప్రాణములలో కేవల మేక ప్రాణావశిష్టుడై రణరంగమున తన కెదురు చూచుచున్నాడను విషయము ఆమెను నిలువనీయుట లేదు, అందుచే దిక్పాలురను దండించుట, పద్మసంభవుని మడియించుట - మొదలుగా పలికిన మామగారి పలుకులను విని, ఈ కార్యక్రమమునకు చాలకాలము పట్టుననియు, అంతకాలము తాను పతిని బాసి నిలువ లేదనియు పలికిన సులోచన

మాటలు, భర్త ననుగమించుట యందు ఆమెకు గల ఆసక్తిని, వేగిరపాటును, సతీత్వమును సూచించుచున్నవి. ఈసందర్భముననే, శూలముననైనను వెన్నియ్యవచ్చును. అనలంబునైనను అతి ధైర్యముతో ప్రవేశింపవచ్చును, కాని పతి విహీతననుభరింపరాదు అనియు, 'వైధవ్యవతియైన వామాక్షి భార మీధరాపతి యౌర్వదేక క్షణంబు' అనియు ఆమె పలికిన పలుకులు పతివిహీన యగు స్త్రీ దుస్థితి నిరూపించు చున్నవి.

అత్తగారగు మందోదరి వలన పుణ్యసాధ్వీలక్షణములను, పతివిహీనయగు స్త్రీ భూభార మను విషయమును, గ్రహించినది. అంతేకాదు ఆమె పలుకులచే, రామమూర్తి అతిదయాపరమూర్తి అనియు తన పతిశిరము దెచ్చుటకు రావణుడు అసమర్థుడనియు గ్రహించి, ఆమె అనుజ్ఞ పొంది తాను స్వయముగా రాముని ప్రార్థించుటకు బయలు దేరినది. ఈసమయమున రావణుని అనుమతి పొందుటకు ఆమె చేసిన సంభాషణము ఆమె వినయ సౌజన్యములకు తార్కాణము. దశ గ్రీవునకు అపజయము తథ్యమని, అత్తగారు ఆమెకు వివరించినది. కాని ఆపలుకులన్నియు ఇట వివరింపక, వైరుల నణచి ఇంద్రజిత్తుశిరము తెచ్చుట దీర్ఘతరయత్న మగు ననియు, తన కానతిచ్చిన తాను సౌమ్యభావమున రాముని సన్నిధికి వెడలి, పతి శిరము పొందుదుననియు ప్రార్థించినది. తాను సీతను చెరపట్టినట్టుల, ఆమెను శత్రువులు బంధింతురేమో అని భయమందు మామగారితో, రాఘవుడు 'పరమ ధార్మికుడని పాపభీరుండు, పరవధూ విషయపంపట పరాఙ్ముఖుడు పరమాత్ముండత డేకపత్నీ వ్రతుండు'! అనియు, పరమ పావనులు కృపాళురు వారు - చెఱవేయ దలతురే చెలుల నెందైన' - అని పలికినది. ఇది పరోక్షమగు రావణుని గుణములకు ఎత్తిపొడుపు. రామునివంటి మహాత్ముడు అట్టి నీచకార్యములకు యత్నింపడను ప్రశంస. (సశేషము)

---

## Statement about ownership and other particulars about 'Samalochana' National & Cultural Fortnightly, Rajahmundry.

### Form IV

(See Rule 8)

| | | | |
|---|---|---|---|
| 1. | Place of publication | : | Rajahmundry |
| 2. | Periodicity of publication | : | Every 1 st and 16 th. |
| 3. | Printer's Name | : | Sri B. Sitharama Sastry |
| | (Whether citizen of India ?) (if foreigner state the country of origin) | : | Indian |
| | Address | : | 6-8-7, Innispeta Rajahmundry-1. |
| 4. | Publisher | : | Sri B. Sitharama Sastry |
| | Whether citizen of India ? (if foreigner state the country or origin) | : | Indian |
| | Address | : | 6-8-7, Innispeta Rajahmundry-1. |
| 5. | Editor's Name | : | Sri B. Sitharama Sastry |
| | (whether citizen of India ?) (if foreigner state the country or origin) | : | Indian |
| | Address | : | 6-8-7, Innispeta, Rajahmundry-1. |
| 6. | Name and address of individuals who own the news paper and partners or share-holders holding more than one percent of the total capitai. | : | Sri B. Sitharama Sastry 6-8-7, Innispeta, Rajahmundry-1. |

I, B. Sitharama Sastry, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date 1-3-1981.

(Sd.) B. Sitharama Sastry,
Publisher.

నాటక చరిత్ర నవ్యయుగారంభంలోని

# నాటకాల్లో వాస్తవికతావాదం

— శ్రీ కె. ముత్యం, ఎం. ఏ.

నాటకరంగ చరిత్రలో గీటురాయిగా చెప్పబడుతున్న 1943 వ, సంవత్సరము తర్వాతకాలంలోని నాటకాల్లో వాస్తవికతావాద (Realism) విస్తారాన్ని పరిశీలించట మీ వ్యాసోద్దేశము.

1939 నుండి '45 వరకు సాగిన రెండవ ప్రపంచయుద్ధము యొక్క తొలి దినాల్లో చలనచిత్రకళ తన ఆకర్షణను పోగొట్టుకున్నది. అప్పటి రాజకీయ పరిస్థితులవలన ఉత్తమ విదేశీ చిత్రముల దిగుమతి కూడా నిషేధింపబడినది. భారతీయ చిత్రనిర్మాణమునకు యుద్ధమువలన ఏర్పడిన ఆటంకముల వలన చలనచిత్రముల స్థాయి పడిపోయినది. వృత్తినాటకరంగ పరిస్థితి కూడా అలాగే అయినది. సరిగా ఆ కాలంలోనే తెలుగునాటక రచనా - ప్రయోగములందు నూతనత్వమును, విజయమును సాధించిన మూడు ఉద్యమములు బయలుదేరినవి. అయితే ఈమూడు ఉద్యమములు 1943_44 సంవత్సరములో మొదలు కావడం వలన తెలుగు నాటకరంగ చరిత్రతోపాటు నాటకచరిత్రయందు కూడా నవ్యయుగారంభ మైన దని చెప్పవచ్చును.

1943లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారిచే ప్రయోగాత్మక నాటకరంగం (Experimental theatre) మొదలైనది. అదే సంవత్సరములో గరికపాటి రాజారావుగారి ఆధ్వర్యంలో ప్రజానాట్యమండలి ఏర్పాటైనది. ఆంధ్ర నాటక కళాపరిషత్తు అంతకు ముందు ఆరంభించి నిలిపివేసిన నాటక పోటీలను 1943లో తిరిగి ప్రారంభించింది. ఈ విధంగా ఈమూడు ఉద్యమములు క్రొత్త నాటక రచయితలకు, క్రొత్తనాటకాలకు, క్రొత్తరకము రంగస్థలములకు, నూతన ప్రయోగములకు నిలయమై, తెల్గు దేశమున నాటకరంగ పునరుజ్జీవనమునకు మూల స్తంభము లైనవి.

ఇంతకు ముందు కాలమందువలెనే ఈ కాలమందు కూడా వివిధ శాఖలలో నాటక, నాటికారచన సాగినది. పోటీల కొరకై, ప్రచారముకొరకై, సాహిత్య దృష్టితో, ఇవి వ్రాయబడినవి.

ఇక నాటక లక్ష్యములో వాస్తవికతా వాదము (Realism) అధిక మైనది. ఇది రెండు విధములుగా సాగినది. ఒక వర్గము వారు తమ కథలను పట్టణములకు పరిమితం చేయగా, మరియొక వర్గము వారు తమ కథలను పల్లెలకు పరిమితం చేసినారు.

సాంఘిక సమస్యలను, దురాచారములను ఇతి వృత్తములుగాచేసుకొని నాటక రచన చేయుట తెలుగునాట మొదటి నుండి ఉన్నట్టిదే! కందుకూరి, కాళ్ళకూరి వారిట్టి రచనలెన్నో చేసినారు. కానీ రెండవ ప్రపంచయుద్ధం అంతమగుటచే దేశమున ఆర్థిక మాంద్యము (Economic Depression) అధికమయ్యెను. దీని నాధారముగా చేసుకొనిన పట్టణము నందలి ధనికులు, జమీందారులు, భూస్వాములు, కార్మిక కర్షకుల నధికముగా పీడింపదొడగిరి. నాటక రచయితలు ఈ జీవిత యథార్థ చిత్రణమునకు పూనుకున్నపుడు వీరి దృష్టిపైని పేర్కొన్న సాంఘిక దురాచారములపై గాక సాంఘిక, ఆర్థికరంగమందలి అసమానత్వముపై తీవ్రముగా ప్రసరించినది.

వాస్తవికత అంటే ఒక రచనా కాలంలో చారిత్రకమైన సత్యం. తన మనస్సులో ప్రతిబింబించిన ఈభౌతిక వాస్తవాన్ని, తన చైతన్యంగాఅభివ్యక్తం చేస్తూ, తనకుగల సాంఘిక పరిమితుల్లో వాస్తవికతా స్వభావాన్ని ప్రజలకందించడమే నాటక రచయిత బాధ్యత.

ఈ వాస్తవిక వాదులు చిత్రింపబూనిన ఆ సమానత్వం ముఖ్యంగా రెండు విధాలు. 1. కేవల పట్టణ జీవితమున సంపాదించిన చాలీచాలని జీతబత్తెములతో బ్రతుకుబరువును మోయలేని నారి జీవిత చిత్రణం మొదటిది. 2. పల్లెలలోని కార్మిక, కర్షకుల అవస్థా చిత్రణము రెండవది.

మొదటి విధానమునకు చెందిన అసమానత్వమును చిత్రించుటలో ఆచార్య ఆత్రేయ గారు అందవేసిన చేయి' వీరిని వాస్తవికతా వాదమునకు ప్రతినిధిగా చెప్పవచ్చును. నాటి విదేశీ ప్రభుత్వములోని నికృష్ట ఆర్థిక సామాజిక వ్యవస్థలో గత్యంతరంలేక నలిగిపోయిన అన్నార్తుని ఈయన ఎన్. జి. వో (1947) లో పరివర్తనం (1949) లో ఆవిష్కృతం చేశారు. ఈయన దేశ విభజనానంతరం సాగిన హిందూ _ ముస్లిమ్ మతకలహాలను నిరసిస్తూ సఖ్యమును 'ఈనాడు' (1947) అనే నాటకంలో ప్రబోధించాడు.మానవ జీవితాలను నిరసించిన శాస్త్రీయ ప్రయోగాలను విమర్శిస్తూ విశ్వశాంతి (1953)లో ఆనాడు 1945 లో నాశనమైపోయిన జపాను దేశాన్ని ధ్వనించడం ఆయనకు వాస్తవికతా వాదంపై గల ప్రగాఢ వాంఛను తెలుపుతుంది.

అదేవిధంగా కొండముది గోపాలరాయ శర్మగారు వ్రాసిన 'ఇదీలోకం' (1946) లో పెట్టుబడిదారుల ఘాతుక కృత్యములు, పేదవారి ఆకలి చావులును చక్కగా చిత్రించారు. 'న్యాయం' (1947) లో మధ్య తరగతి వారి మనస్తత్వమును చిత్రీకరించారు.

అనిసెట్టి సుబ్బారావు గారు 'మావూరు' (1954) లో నాటి గ్రామ రాజకీయాలను చిత్రిక పట్టారు. బెల్లంకొండ రామదాసు గారి 'అతిథి' (1953), 'ఆకాశరామన్న 'మాస్టర్జీ' అనే నాటకాలు కూడా ఆనాటి పీడిత ప్రజానీకానికి, ధనవంతుల అవినీతికి సంబంధించిన రచనలే !

ఇక వాస్తవిక వాదాన్ని ప్రవచించుటలో రెండవ వర్గము వారికి పల్లెలలోని కార్మిక, కర్షక జనం కడగండ్లే కథావస్తువులైనవి. భూస్వాముల స్వార్థపరత్వం, ఆరుగాలము కష్టపడ్డా ఆలుబిడ్డలకు కడుపు నిండా తిండి, కట్టుకొనుటకు గుడ్డ, లేక సామాన్య మానవుడు పడేడి కష్టము; రచయితలకు కనువిప్పు కలిగించినవి. అందుకు తోడు రాజకీయ వాదులు ఈ ఆర్థిక అసమానత్వము నాలంబనముగా చేసుకొని తమతమ పార్టీలను దేశము నలుమూలలందు గల ప్రజానీకానికి సన్నిహితం చేయ తలపెట్టుటచే ఈ రెండు ఆశయములతో పరిణమించిన ఉద్యమమే 'ప్రజానాట్య మండలి'. 'సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావుగారలు 1945 లో 'ముందడుగు' అనే నాటకమును వ్రాసిరి. అందులో జమీందారి విధానము రైతు, కూలీలను ఎట్లు అణగద్రొక్కినదో చిత్రించిరి. పది, పన్నెండు ప్రదర్శనము లగుసరికి నాటకమును నిషేధించినది ఆనాటి ప్రభుత్వము. తర్వాత ఈ రచయితలే 'మాభూమి' (1947) ని రచించిరి. ఇందు దేశముఖులకు, ప్రజలకు జరిగిన పోరాటము వర్ణించబడింది. ఇదికూడా నిషేధింపబడినది.

ఆ తర్వాత బోయి భీమన్న గారు వ్రాసిన 'కూలిరాజు' పాలేరు మొదలగు నాటకాలు భూస్వాములకు, కూలీలకు మధ్య సంఘర్షణ మితి వృత్తముగా కల్గినవి. కొడాలి గోపాలరావు గారు వ్రాసిన పేదరైతు (1952), కూలీ (1953), తిరుగుబాటు (1954) మొదలగు నాటకము లన్నియు వాస్తవిక వాదమును ప్రతిబింబించినవే.

వాస్తవికతా వాదము నాలంబనముగా చేసుకొన్న రచనలన్నియు ప్రదర్శన దృష్టితో వ్రాయబడినవగుటచే ఇంచుమించుగా ఈ కాలములో వెలువడిన వన్నియు ప్రయోగ సౌలభ్యము కలవియే అగుచున్నవి.

నాటకాంతమున ఎట్టి సందేశము గాని, నీతిగాని లేక కేవల పరిస్థితుల యథార్థ చిత్రణము, సంభాషణా సన్నివేశములను మిక్కిలి 'నాటకీయముగా మార్చుట, సాంప్రదాయికము లైన కట్టుబాట్లపై తిరుగుబాటు నాటకాల్లో స్త్రీపాత్రలను తగ్గించుట మొదలగునవి వాస్తవికవాద నాటకాల్లో సాధారణ లక్షణాలు. ఇవే లక్షణాలు తర్వాతితరము నాటక రచయితలచే స్వీకరింపబడి అధునిక నాటక చరిత్ర కొక వినూత్నతను, వైశిష్ట్యాన్ని సంపాదించాయి.

—...—

# ఈ పక్షంలో

'సాహిత్య గౌతమి', 'విశ్వసాహితి' సంయుక్త ఆధ్వర్యవంలో స్థానిక గౌతమీ గ్రంథాలయంలో 18-2-81 న ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ, నూతలపాటి గంగాధరం, పురస్కారం పొందిన శ్రీమతి ఆర్. వసుంధరాదేవి గారి 'గాలి రథం' కథాసంపుటి (కథాసంపుటి) పై చర్చా గోష్ఠి జరిగింది. 'సాహిత్యగౌతమి' అధ్యక్షుడు శ్రీ పోతుకూచి సూర్యనారాయణ మూర్తి సభకు అధ్యక్షత వహించారు.

విశ్వసాహితి అధ్యక్షులు శ్రీ పోతుకూచి సాంబశివరావు ముఖ్య అతిథిగా పాల్గొంటూ, ఇదివరలో జరగిన చర్చా గోష్ఠులను గురించి, పుస్తకాలను గురించి, ప్రస్తావించారు. 'గాలిరథం' కథల సంపుటిలో శ్రీమతి వసుంధరాదేవి ప్రతిభ, పాత్ర చిత్రణ వైవిధ్యం, మనస్తత్వ పరిశీలనా కౌశలం, వ్యక్తమవుతున్నా యన్నారు.

శ్రీ వేదుల శ్రీరామచంద్రకీర్తి ప్రసంగిస్తూ, ఈమె కథలలో ఒకవిధమైన నిరాశావాదం ప్రస్ఫుటంగా కన్పిస్తున్నదని, అదే రచయిత్రి ఉద్దేశం అయితే, ఆమె పూర్తిగా కృతకృత్యురాలయిందని చెప్పారు. కథలలోని వైశిష్ట్యం బాధాసర్పదష్టుల జీవితాల్లో ఎగుడు దిగుడులు, చక్కగా హృద్యంగా చిత్రించారన్నారు.

డా॥ తల్లావఝుల పతంజలిశాస్త్రి తమ సునిశిత విమర్శక ప్రసంగంలో ఆమె రచనా శైలిని, తాత్త్విక జిజ్ఞాసని కొని

యాడారు. 'పెంజీకటి కావల' అన్నకథ ఒక దశాబ్దపు తెలుగుకథల్లో అగ్రస్థానం వహిస్తుందని తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు.

శ్రీమతి రాధాప్రసాద్ తమ ప్రసంగ వ్యాసంలో ముఖ్యంగా 'పిచ్చిగీతలు' కథపై సవిమర్శక ప్రశంస చేశారు. ఈనాటి ప్రతికల్లో విరివిగా వచ్చే 'అబ్బాయి - అమ్మాయి' కథలకు భిన్నంగా, ఒక ఆలోచనాత్మకమైన విలక్షణతతో వసుంధరాదేవిగారి కథలు పాఠకుల్ని ఆకట్టుకుంటాయని అన్నారు. శ్రీమహేశ్వర్ మాట్లాడుతూ 'గాలిరథం' పేరు ఈసంపుటికి ఎంతఅర్థవంతంగా ఉందో వివరించారు. కీర్తిగారు అన్నట్లు ఈమెకథల్లో నిరాశావాదం ఎంతమాత్రము గోచరించలేదని అన్నారు. ఈమె 'Rape' దృశ్యాన్ని అంత సమర్థనీయంగా చిత్రించలేదేమో అన్న సందేహాన్ని వెలిబుచ్చారు.

శ్రీ ఆర్. యస్. సుదర్శనం మాట్లాడుతూ 'చావు'వస్తువుగా తీసుకున్న కథల తోరణం యిది అని, అందుచేత కేవలం రచయిత్రికి నిరాశాభావం జీవితంపట్ల ఉందని అనుకోవడం సరియయినది కాదని, అన్నారు.

శ్రీమతి వసుంధరాదేవి తమ కథల్ని ఏవిధంగా వ్రాశారో తెలియచేస్తూ విమర్శకులకు తగు సమాధానా లిచ్చి సందర్భోచితంగా ప్రసంగించారు.

సుమారు రెండుగంటలు జరిగిన యీ సాహిత్యగోష్ఠి ప్రయోజనకరంగా సాగిందని విజ్ఞులు, సాహిత్య ప్రియులు అభిప్రాయపడ్డారు.

(వి. యస్.)

## త్యాగరాజ గానసభలు

ఫిబ్రవరి 9 తేదీనుండి 19 తేదీవరకు రాజమండ్రిహిందూసమాజ ఆవరణములో శ్రీ త్యాగరాజ నారాయణదాస సేవా సమితి వార్షికోత్సవ సభలు విజయవంతముగా జరిగినవి. రోజూ సాయంకాలం 5½ గం||లు మొదలుకొని దాదాపు రాత్రి 1 గంట వరకు వేలకొలది శ్రోతలు వివిధ గానమాధుర్యములు అనుభవించి ఆనందించేవారు.

శ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, శ్రీ యీమని శంకరశాస్త్రి, శ్రీఎల్లా వేంకటేశ్వరరావు, శ్రీకమలాకర రావు శ్రీఅన్నవరపు రామస్వామి, శ్రీ ఎం. ఎస్. బాలసుబ్రహ్మణ్యశర్మ, శ్రీమతి శ్రీరంగం గోపాలరత్నం, శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రి, శ్రీ కోట సచ్చిదానంద శాస్త్రి, శ్రీ బి వి. రామన్, శ్రీ బి. వి. లక్ష్మణ్, మున్నగు ప్రముఖ విద్వాంసులు తమ వైదుష్యమును ప్రదర్శించి యున్నారు.

ముప్పదేండ్లనుండి గానసభల నిర్వాహకులుగా విశిష్టసేవ చేయుచు షష్టిపూర్తి గావించుకొన్న శ్రీబుర్గాపాపయ్య శాస్త్రి గారిని ఈ సభల సందర్భమున ఘనంగా సత్కరించి రు 5000-లు సన్మానసంఘము వారు బహూకరించి యున్నారు.

సుప్రసిద్ధ వైణికులు శ్రీ శిష్టు శ్రీరామశాస్త్రిగారు కచేరీచేయుచు నాదబ్రహ్మమున లీనమై భౌతిక శరీరమును విసర్జించిన విషయము ప్రజానీకమునకు మిక్కిలి విషాదము కలిగించినను వారిజన్మము ధన్యమైన దను భావము సర్వత్ర భాసిల్లినది.

## సాహిత్య సభ

22-2-81 తేదీ సాయంకాలం అల్యూమినియం మర్చంట్సు అసోసియేషను హాలులో శ్రీ సి. నరసింహాచారి, ఎం.ఏ., ఎం.యిడి, బి.ఎల్. గారి అధ్యక్షతను సారస్వత సమితి యాజమాన్యమున సాహిత్యసభ జరగినది.

ప్రముఖ లాయరు ప్రెసిడెంట్ క్లబ్బు అధ్యక్షులు శ్రీ పోతుకూచి సూర్యనారాయణమూర్తిగారు 'నేటి కవిత్వం' అనే విషయంపై ప్రసంగించినారు. ప్రాచీన అధునాతన వివిధ భాషాసాహిత్య ప్రక్రియల తులనాత్మక పరిశీలనము గావించినారు.

## జాషువా జయంతి

ది 20-2-81 న మహాత్మాగాంధీ జూనియర్ కళాశాల, అత్రేయపురంలో కళాశాల తెలుగు లెక్చరరు శ్రీతణుకు రామారావు గారి అధ్యక్షతను జాషువా మహాకవి జయంతి జరగినది. ఈసందర్భంగా విజయనగరం మహారాజా కళాశాల తెలుగు లెక్చరరు, జాషువాకవిత్వముమీద రీసెర్చి పట్టముపొందిన శ్రీ ఆచార్య భావన్, ఎం. ఎస్. ఎన్. ఛారిటీస్ తెలుగు లెక్చరరు శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారు, అమలాపురం ఆంధ్రబ్యాంకులో పనిచేయుచున్న శ్రీ కొల్లూరి సూర్యనారాయణగారు విచ్చేశారు. అతిథు లందరికీ కళాశాల ప్రిన్సిపాలు శ్రీ వి. సత్యనారాయణమూర్తిగారు స్వాగతము పలికారు. శ్రీ జె. మార్కండేయులు (కళాశాల తెలుగు ఉపాధ్యాయులు) జయంతి ప్రాముఖ్యమును గురించి మాట్లాడారు. కుమారి ఎ. సత్యవతి అతిథులను పరిచయముచేస్తూ జాషువాకవిని గురించి కొన్నివిషయాలు చెప్పారు. శ్రీ ఆచార్యభావన్ జాషువాకవికి అక్షర కవితాపుష్పములు సమర్పించి, ఆయనకృతులలోనిగొప్పతనాన్ని, తాను ఆయననుగురించి వ్రాసిన విషయాలనీ సమన్వయపరుస్తూ చక్కగా ఉపన్యసించారు. శ్రీ అద్దేపల్లి శ్రావ్యకంఠమున జాషువాకవి కృతులను వివరిస్తూ, కమ్మని ఆయన పద్యాలను వినిపించారు. శ్రీ కొల్లూరి స్వీయకవితలు చక్కగా పఠించారు. (వి. యస్. యం.)

—...—

# సమాలోచన సంపుటములు

వివిధ సాహిత్యాది విషయాలకు చెందిన 241 రచనలతో గూడిన సమాలోచన తృతీయ సంపుటము 24 సంచికలు ఒకే వాల్యూముగా హాఫ్ క్యాలికో బైండు చేయబడి అమ్మకమునకు సిద్ధముగా నున్నది.

వెల రు. 20 లు. ఎం. ఒ. ద్వారా పంపినవారికి పోష్టుఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోష్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

మొదటి, రెండవ సంపుటముల వాల్యూములు పూర్తిగా అయిపోయినవి.

— సంపాదకుడు.

అడ్రసు :—

సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,

రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజీ,

6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.